సాధన గ్రంథ మండలి - 80.

శ్రీ మహాత్రిపురసుందర్యైనమః

# అమ్మతో ముచ్చటలు

కూర్పరి:

శ్రీ శ్రియానంద సాధాపర నాముఁడు
ఈశ్వర సత్యనారాయణశర్మ
శ్రీకాకుళము.





ప్రకాశకులు:
సాధన గ్రంథ మండలి, తెనాలి.

 1960 [వెల రు. 1-

# పీఠిక

ఏతత్కృతికర్త శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారిని నేను స్వయముగా నెఱుఁగను. వారు శ్రీకాకుళమువారు, నేను నెల్లూరువాఁడను. మా యిర్వుర నడుమ 500 మైళ్లదూరము గలదు. దేశముంబట్టియేగాక, యోగ్యతంబట్టియు నటులే యంతరము గలదని నా నమ్మకము. వారు పాదుకాంతదీక్షఁ గొన్న శాక్తవిద్యాధురంధరులు. నేనో, శుద్ధాద్వైత విద్యాతత్పరుఁడనయ్యుఁ జాపలమున సౌందర్యలహరిం దెనిఁగింప దొరకొన్న సామాన్యుఁడను, వారు నా తెనిఁగింపును, నేను వారి 'సౌందర్యలహరి' తెనిఁగింపును ఒక నెలనాఁడు చూచుటయే మా సౌహృదయమునకు మూలము. ఈపాటి పరిచయమునకే వారు పరితుష్టులై యీ త్రిశతికి (తొలి కూర్పు) నన్నుఁ దొలిపలుకు వ్రాయుమని నిర్దేశించుట వారి యౌదార్య విశేషమే.

2. అదేమి చిత్రమో, నేను తొలుదొల్త నాంధ్రీకరించిన "లక్ష్మీశృంగార కుసుమమంజరి" యు యీ సంప్రదాయమునకుఁ జేరిన మహావిద్యానిధిదే. వారి దీక్షానామము 'పరిపూర్ణానందనాథుడు'. ఇఁక వీరో శ్రీశ్రియానందనాథులు. ఈ ఆనందనాథసంప్రదాయము అత్యంత మాననీయమని నా మిత్రులు బ్రహ్మభూతులు శ్రీమచ్చిదానందనాథులను దీక్షానామముగల శ్రీ చిపుకుల వేంకటశాస్త్రిగారు పలుమారు చెప్పఁగా వింటిని.

3. "అమ్మతో ముచ్చటలు" అను పేరనే విశేషము గలదు. శ్రీదేవి యిక్కవివతంసునకుఁ బ్రత్యక్షమేమో?

"(శ్రీ) మాతృసన్నిధానమును గల్పించుకొని యొక భక్తుఁడు వ్రాసిన పద్యము"లని వారన్నను, దేవినిరంతరము ధ్యానగోచర యగుటయు ఆ యానందార్ణవమున దాను స్వరూప విస్మృతిం గనుటయు శర్మగారు వర్ణించుకొనియున్నారు.

ఉ॥ ఏచిన ధ్యానవేళ నిను నెంతగఁజూచిన దన్వి పోదు, క
న్వాచినయట్టులుండు నొకనాఁడు నినుం దలపోయకున్న; న
మ్మా! చితిరూతవౌచుఁ 'దిగమైతను' దోచుచునుందు; వింతయున్
జూచియె నిన్మహాత్రిపురసుందరి కందు రమందధీయుతుల్.

చ॥ నిను నెడలేక యెంచుకటి నీళులముంచిన కుండనై జలం
బునఁబడు పంచదారనయి, ప్రొద్దువెలుంగున వెల్గుదివ్వెనై
యనలమునందుఁ గాలు నినుమై, పరమైక్యమునొందువేళ నా
యనుభవ మేరికిం దెలుపు టమ్మరో! యన్యము లేమిఁబార్వతీ!

పద్యము లన్నియు నిట్లే గంభీరాశయగుంభితముగా నున్నవి. శర్మగారు కొన్నింట స్వీయచరిత్రముఁ జెప్పికొన్నారు. కొన్నింటఁ దమ యపూర్వానుభూతుల నుగ్గడించుకొని యున్నారు. కొన్నింట సృష్టి వైచిత్ర్యములు, దేవి పారమ్య మును అభివర్ణించియున్నారు. కొన్నింట శాక్తతత్త్వార్థముల నుపన్యసించియున్నారు.

ఏ విషయముం గూర్చినదైనను పద్య మొక్కొక్క టియు నేదేని యొక్క చమత్కారమున కిక్కయై తలఁ యూపింపఁ జాలియున్నది.

"కిం కవేస్తస్య కావ్యేన కాండేన చ ధనుష్మతః
పరస్య హృదయే లగ్నం న ఘూర్ణయతి యచ్ఛిరః"

కొన్ని వ్యాఖ్యాన సాపేక్షములును గలవు. మచ్చునకు రెండు చూడుడు.

1. జననీ ! ద్వంద్వసమాసమందు మతిశిక్షావాక్యఅన్ వద్దుబ్రౌ
ఖ్యన నగ్రస్థితి నీది; వంద్యపదభిత్తుండైనను దల్లికే
వినతుల్సేయక తప్పు; దీవిధము భావింపంగఁ బ్రాముఖ్యమున్
జననీసేవకె వేదమిచ్చె ననఁగా సందేహమా ? శాంభవీ !

2. అమవసచూడ్కినో చలన మందని పున్నమచూపులోనొ పా
ద్యమి కనుబాటునందొ నిను నారయలేని దినంబె దుర్దినం
బుమ ! సతిమూర్తిగానో, యొక యుత్తమతేజముగానొ మంత్రరూ
పముగనో, కానుపింపు మెడఁబాయక యన్నియవస్థలందునున్.

ఈ వీరి త్రిశతి సర్వథా శ్లాఘ్యమై శ్రీవిద్వాంసుల మెప్పింపఁజాలియున్నది. శర్మగారి తక్కుపద్యములును ముద్రితములై, ఇంకను మున్ముందు ఇతోధికముగ వెలువడి ఛాత్రులయు, మిత్రులయు, పాత్రులయు కరముల నలంకరించుగావుత మని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,
సాహిత్యస్థాపకాచార్య, అభినవతిక్కన
దుర్భా సుబ్రహ్మణ్యశర్మ

నెల్లూరు
12—5—1951



శ్రీమాత్రే నమః

# రెండు మాటలు

అమ్మతో ముచ్చటలనెడి యీ కూర్పు పేరే, దీని కూర్పరి యాత్మవస్తువును మాతృబుద్ధితో నర్చించు నొక శాక్తబంధుఁడని చెప్పక చెప్పుచున్నది. నిర్గుణావస్థయందు నిరంజనము నిష్క్రియము బ్రహ్మము మున్నగు పేళ్ళతో వ్యవహరింపఁబడునదియే సగుణావస్థయందు మాయా మహామాయా దుర్గా కాళీ త్రిపురసుందరీత్యాది నామములతో వ్యవహరింపఁబడు ననెడి విశ్వాసమే నిండుగాఁగల వీఁడు, పండితుఁడనిగాని కవియనిగాని చదువరులు భ్రమపడకుందురు గాక. అమ్మ బిడ్డనెయ్యపుంజవిని వేసారులు చవిచూచిన యొక వెఱ్ఱినాగమ్మ.

భావమయి యమ్మ (ఆత్మ) తాను శబ్దబ్రహ్మమయియై వెలువడునపుడు, అమ్మ తత్త్వము నడుగవచ్చిన తనవారికి నచ్చఁజెప్పునపుడు, తాత్కాలిక ద్వైతభావముతో శ్రీమాతను వేఁడుకొన్నపుడు, అమ్మ గొప్పతనము లోనుబుకునపుడు, జాగతికములగు కొన్నిముచ్చట లమ్మకు నివేదించునపుడు, తన గోడు తల్లితోఁ దడవికొనునపుడు, నమ్మ యే మాటల రూపున బయలయ్యెనో యామాటలను ఛందోబద్ధములుగాఁ జేయు ముచ్చటరూపున నమ్మయే వెలువడునపుడు, అమ్మ సాన్నిధ్యమును గల్పించుకొని యమ్మ చెప్పినటులు వ్రాసిన వ్రాతలే యీ ముచ్చటలు. వాగ్రూపమున నుచ్చరించు నమ్మ యంగములను బద్యరూపములను సాధకలోకమునకుఁ జూపు వేడుక చిన్నటఁగోలెఁగల వీనిదొక తీరు తిక్క.

మొత్తముపై నీ తిక్కమాట ఉపాసనానుభవము లతో నిండియుండుటచే నవి యన్నియుఁ దన్నుఁబోలిన సాధకు లకు బోధములుగాను నుపదేశములుగాను నుపచరింపఁ గలవియే.

వెనుకటినోములు వెర్తియగుట నేమో మాటలయాస్తి చాలని యీ పేదకూర్పరి, అమ్మకు బలువుగా నగలు పెట్టి నగల నాడెమంతే చూపరుల బుద్ధులను గప్పపెట్టువాఁడు కాకుంటయే మేలయ్యెనని చదువరులు తన పేదఱికమునకే సంతసింతురని యాసించినవాఁడు.

ఇమ్ముచ్చటలందుఁ జక్క గుర్తు గలవి పదియేండ్ల వెనుక వెలువడినవి. చేసాగకయు, శబ్దమయియైన యమ్మ మఱికొన్ని వేసములను లోకమునకు ముందుగాఁ జూపు ముచ్చటయుఁ గారణముగా మూలఁబడియున్న ముచ్చటలను మఱి మూఁడువందలనుమాత్రమే వెనుకటివానితోఁ జేర్చినాఁడు.

సాధనగ్రంథమండలి వ్యవస్థాపకులు బ్రహ్మశ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు సాధకజీవలోకసేవకై పడుపాటు పదేండ్లనుండి యెఱింగియు, నింతదాఁక నెట్టి యుడుతబత్తియుఁ జూపలేక యిపుడమ్మ పొడిచిచెప్పగాఁ, నీ దీనుఁడు మండలి కెట్టి సేవ చేయఁగల్గెనో శ్రీ శాస్త్రిగారివలననే తెలియఁ దగును.

ఇపుడీ ముచ్చటల కూర్పు సాధన గ్రంథమండలియందాఁక పూసగా నంగీకరించినందులకుఁ గృతజ్ఞుఁడనై సభ్యుల కును, వ్యవస్థాపకులకును వందనములతోఁ దూగినంత వెచ్చముతో నచ్చుకొన్నాఁడు.

మండలి గ్రంథమాలయందుఁ జేరఁదగిన మేరుపుపూసల వంటివి "సిద్ధాన్తశిఖామణి" (వీరశైవ ప్రామాణిక గ్రంథరాజము), దుర్గా (చండీ) సప్తశతికి సమగ్రాధ్యాత్మిక వివరణము మున్నగున వెన్నో మూల మూల్గుచున్నవి.

భగవద్గీత అమ్మ మణిమందిరమునకుఁ బ్రాకారమనియు, అది మనోమయకోశ సాధన మనియు, దుర్గాసప్తశతి (చండీ పాఠము) అమ్మ మణిమందిరమే యనియు, నిది విజ్ఞానమయ కోశ సాధనమనియు నీతని "శాస్త్రసాధన" మనెడి మండలి ప్రచురణమందు సభ్యసాధకులు చూచియుందురు.

అమ్మ తన తత్త్వమును దనకే విసువెత్తునంతకుఁ జెప్పిన యాధ్యాత్మిక వివరణము జానియందే కలదు. అది బహు ద్రవ్యసాధ్యము. శాక్తశిశు వొక్కఁడేమి చేయఁగలఁడు? దాని యావిష్కరణభాగ్యదినము చేరువ యగుటనే సాధన గ్రంథమండలి నాశ్రయింపుమయ్యా! యని పొడిచినది. ఇఁక దాని భారము మండలిదే.

తుంటరిబిడ్డలు దుమ్ము చిమ్ముచున్నను, జడివానలు తడుపుచున్నను, గొన్ని చక్రము లఱిగిపోయినను, దానే తన పనులు నెఱవేర్చికొనఁ బన్నుకొన్న యీ యంత్రముచే 75 ఏండ్లు పనిచేయించిన శ్రీమాతను మండలి సభ్యులెల్లరుఁ బ్రార్థించి యంత్రస్థితికై యాశీర్వదించినచో మఱికొన్నాళ్లు పనిచేయఁగలదని యాశించుచున్నాను.

* * *

# కృతజ్ఞత

అమ్మతోఁ ముచ్చటల తొలివంతునకు నవ్యాజప్రేమతో నాఁడు పీఠిక వ్రాసిన అభినవతిక్కనాది బిరుదాంచితులు, స్వర్గీయ శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారి పవిత్రాత్మ నిత్యవంద్యము.

"ఇపుడు రెండువంతులుగా వెలువడిన యీ ముచ్చటలకుఁ బండితాభిప్రాయము లక్కఱలేదా ?" యని ప్రకాశకులు సాధన గ్రంథమండలి వ్యవస్థాపకులు నన్నడుగునపుడు, ఈ లాంఛనము నెఱవేర్పఁదగువారిని మనసు వెదకికొనుచుండెను. నాఁడే "నీవు – నేను" అను నామము దిద్దుకొన్న యొక చిన్ని గ్రంథరత్నమును దనివితీఱ ననుశీలించుచుండ, "ఇపుడు నీ చేతి నగగా నున్న దీనికిం బలుకలు తీర్చిన సిద్ధహస్త శిల్పి, శ్రీ గోటేటి సత్యనారాయణమూర్తి (డి. యస్. పి.) గారే చుమా" యని బుద్ధిచెప్పివేసినది. తడయక ప్రకాశకుల కది వ్రాసి, యభ్యర్థి స్థానమున మీరె నిల్చి శ్రీవారికి నాపుస్తకముతో నతులందింపుఁ డంటిని. వారును గాదనక కారుణ్యముతోఁ బ్రశంసాపద్యము లను బ్రసాదించిరి.

ఇఁక దురూహమగు నమ్మ కరుణాప్రేరణముచే, శ్రీవారే, అమ్మ ముద్దుకొడుకట్లతోఁచు, శ్రీ పాతూరి మధుసూదనరాయ శాస్త్రిగారిని గోరి వ్రాయించిన యభిప్రాయము నాకుఁ జేర్చిరి. చూడఁగా శ్రీ శాస్త్రిగారి సూక్ష్మానుశీలన, విమర్శశక్తి, శ్రీ విద్యారహస్యవేత్తృత, గుణగ్రహణ వైభవముఁ దేటపడ "సీతమ్మ లిట్టిరు పలువురున్నారు చుమా" యని తెలుపుటకో, యమ్మ యిమ్మహాత్ముని పరిచయలాభము నిమూలమునఁ గలిగించినదని పొంగిపోతిని.

అమ్మ యానగా నిష్పాక్షికానుశీలనముం జరిపి, యీ ముచ్చటలకు ముచ్చట నెచ్చించి యమ్మ నలరించిన యీ సాధక జీవరత్నములను దలంచాల్చుచున్నాను.

ఇటులు,

శ్రీకాకుళము
18—1—60

నిరంతరసాధక శుభచింతకుడు, శాక్తబంధుడు,
శ్రీ శ్రీయానందనాథుడు,
ఈశ్వర సత్యనారాయణశర్మ.

---

## ప్రమోదము

భగవ దుపాసనా విధానము లనేకములు. చరాచరరూపమగు ఈ సృష్టియంతయు పరమేశ్వరినుండియే ఆవిర్భవించినది. భక్తుడు తన యుపాసనా బలముచే నిష్టదైవముతో ముచ్చటించుట, ఆ ముచ్చటలను సాధక భక్త లోకమున కందిచ్చుటయు పూర్వజన్మసుకృత విశేషము. పరమేశ్వరి కృపను పొంది ఆమెతో ముచ్చటలుజరుపుటలో శ్రీ శ్రీయానందనాథులు సిద్ధహస్తులు. వీరి పద్యములన్నియు విజ్ఞానరత్న పేటికలు. వ్యాఖ్యానసాపేక్షములు. సాధక భక్తలోకమునకు విజ్ఞానపథప్రదర్శక కరదీపికలు.

శ్రీ శ్రీయానందులవారి ఆధ్యాత్మిక విజ్ఞానప్రతిపాదిత గ్రంథములను లోకము చవిచూచియున్నది. సాధకలోకమున కుపకరించు విజ్ఞానమును సమకూర్చి, సాధకుల కరకమలముల కందివ్వ కుతూహలముతో, ప్రతిఫలాపేక్ష రహితముగ శ్రీవారు, గ్రంథములతో పాటు ప్రకటనవ్యయముగూడ యథావకాశముగా ననుగ్రహించుచు, మా మండలికృషికి తోడ్పడుచు సాధకులయెడ చూపు అభిమానము నిరుపమానము. ఇట్టి సదవకాశమును సద్వినియోగము చేసికొను భాగ్యము సాధకులది. కాన మా మండలి సభ్యులు, ఇతరులు మాకు సంపూర్ణసహకార మివ్వగలరని విశ్వసించుచున్నాను.

లోకోపకారములగు నిట్టి యాధ్యాత్మిక గ్రంథరత్నముల నితోధికముగా రచించుటకు శ్రీ శ్రీయానందులవారికి ఆయురారోగ్యముల నిచ్చుగాత యని శ్రీ జగన్మాతను సదా ప్రార్థించుచుంటిని.

వికారి – ఫాల్గుణము
తెనాలి

బులుసు సూర్యప్రకాశశాస్త్రి
వ్యవస్థాపకుడు : సాధన గ్రంథ మండలి.

శ్రీ శ్రీయానందనాథాపరనాములగు

బ్ర.శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారి 'అమ్మతోముచ్చట'లపై

## * ప్రశంస *

లలితపదప్రయోగమునఁ లాలనఁజేసెడు నమ్మవోలె మ
మ్మలరిచి స్వాదుభావముల నంతలు నింతలు గోరుముద్దలై
తులుచన జీర్ణమాటకుఁగదో యిటు ముచ్చట లాడుచుంట్లు శ్రీ
లలితపరమ్మగా నుడివి లాభముగూర్తువు 'నాథ'వంశజా !

నీలో నీవిటు మాటలాడఁగ మనోనిర్మాలసంబాట నీ
వాలోచించితివే మొకాని మణుల ట్లాయాయెడన్ వెల్గులై
మాలక్ష్యంబున దీప్తిగూర్చి చను మామార్గంబు నిర్బాధమా
టాలోకింప సహాయమౌకద శ్రీయాఖ్యానందనాథాభిధా !

ఆ తుది నేమి శేషమగు నంతట నేమగునే మొకాని యీ
మాతృపదాభివందనము మర్మములేని నివేదనంబు లీ
రీతి ముఖాముఖిన్ నిలిచి ప్రేముడినూటల నాడుకొంటయున్
బ్రాతిక దే! తదీయ సుఖభాక్కుల మమ్మొనరించి తేకదే !

అవు, నటు మాతృదేవి ముఖమందున నిల్చి సుధాఘటంబె వా
స్తవముగఁ గ్రుమ్మరించినఁగదా యిటు పుంఖితభావమై మధు
స్రవమగు కైతలూరి యపరంజికిఁ దావులఁగూర్చు మాడ్కి శ్రీ
ప్రవిమలగాథలై దురలు భాగ్యము కల్గె! నదెంతపుణ్యమో !!

జీవితలక్ష్యమై జనని చిన్మయరూపమునందు భక్తి సం
జీవిగ నుంటగాక, యిటుఁ జెల్లియు సప్తతి వీఁగకింత శ్రీ
దేవికి సేవగా నొరులఁ దెల్పుటఁ గైతయు వ్యాఖ్య జేయఁగా
జేవయె? ఈశ్వరాన్వయుఁడ "జే"యనఁ జెల్లదె నీ ప్రసక్తికిన్.

తెనాలి
18-1-60

గోటేటి సత్యనారాయణమూర్తి

కవి, పండిత, హరికథకహంస

బ్రహ్మశ్రీ పాతూరి మధుసూదనరావుశాస్త్రిగారి

# అభిప్రాయము

నేను శ్రీ గోటేటి సత్యనారాయణమూర్తి (D. S. P.) గారి ప్రేరేపణతో ఈ పవిత్రగ్రంథం చూచే భాగ్యం కలిగి అమందానందం పొందాను.

'అమ్మతో ముచ్చటలు' అనే ఈ గ్రంథరత్నం శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారు రచయితగా సానలుతీరింది. శ్రీకాకుళము వద్ద నాగలేటిఒడ్డున పుట్టిన ఈ కులకళారత్నం, నా హృదయానికి శ్రుతస్మృతితో జిగి గూర్చి అది ద్వాదశారములో నాకు కొంతసేపు విశ్రాంతి కలిగించింది, అంటే అతిశయోక్తి కాదు.

31 పద్యం – సర్వజగదంబా! అనే పిలుపుతో ప్రారంభమైన సరస్వతి, 52 లో సుమనోమార్గావలంబినియై, ఎడనెడ పూజాస్వీకారములతో సోమస్థానమున శివాంకారోహణముతో అవిరతసౌఖ్యస్వరూపిణియైనది.

64 – 'త్రినయనవిలసద్రక్త, షడ్వక్త్రియుక్తాం' అనియు, మరియొకచోట 'తన్మధ్యే హాకినీసా శశిసమ మధురా వక్త్రి షట్కం దధానా' అనియు, ఉపాసకదృష్ట్యా ఉపాస్యరూపము వర్ణితమైనను శ్రీ శర్మగారిచే వికసద్బంధూకపుష్పగా రాజిల్లి, యీ తల్లి ఫలప్రాపకశక్తి, హ – క్ష కళాపరిలసిత శరీరిణియై షడధ్వసింహాసనేశ్వరి యైనది.

శ్రీ కవి, 83 – 'నిద్దురకాని నిద్దురలో ముద్దుగా సుద్దులు పల్కిన అమ్మముచ్చట పద్దులో వేసికొన్నాడు.'

97 – మనసు మాత్రంత్రిఫినిర్జేజనాబ్ధిలో మునిగి, చతుర్థ పాదమున నగణ్యాచింతాబ్ధిగా మారినా, అపూర్వ రత్నాన్వేష ణాతో ధన్యత ప్రాప్తించింది.

120 – పాదసంస్తుతితో 122 – మరల పుట్టుగిట్టులు లేని భవ్యనమస్కృతు లర్పించి, 151 – ఇసువురన్నలు అమ్మ యూరు వుల నలంకరింప, హృదయాసన మభిన్న వాత్సల్యప్రసాదముగాఁ పరిగ్రహించుకొన్నాడు.

153 – దీనముగా వేడు పసిపాపను లోకసంస్కార రూపిణియైన అమ్మ నిర్నిద్రదీక్షతో శిక్షణమిచ్చి పుత్రునకు సాన్నిధ్యభాగ్యమిచ్చి రక్షించుటలో సంశయము లేదు.

178 – నవనాథులలో ఆనందనాథమూర్తి ప్రధానమై అనాథావనశీలయై నిరాధారాన్తరాభ్యర్చనాపరమానవనాథా కృతిదాల్చిన హృద్యవిద్యాసరస్వతి నవరాత్రార్చన చేయించు కొన్నది.

191–సృష్టేష్టాష్టమూర్తులు ఉపాధులుగా శివనిలయమై అసీమానందమును ఆత్మస్వామికిస్తూ అర్ధనారీశ్వరత్వం సార్థకం చేసుకొన్న అమ్మ, 194 – తన రూపమును రాత్రిందివములుగా స్పష్టీకరించి కాళీప్రథతో వంద్యమైనది; కాదామరి!

207 – లోకనింద్యాసురపీడానాట్యమును దివ్యపరాక్రమ ప్రబలబల ఫల శాన్తరసప్రవాహంతో అపూర్వసుఖాలంబన ముగా చేయటం అమ్మయొక్క ఆశ్చర్యలీల.

240 – అండమంతయు రసాత్మకనారమై నారాయణ మూర్తి అండమధ్యమున వటపత్రశయానుడౌటచేతనే, అమ్మ అనుగ్రహరూపానందంతో జగజ్జనయితృఖ్యాతిని చేత చిక్కించుకొన్నాడు.

290 – ఆ విధముగానే జగద్భోగము సుఖమయముగా భావించినవారు, నీరోగులూ నిరాగసులూ రాసవిలాసులూ అమ్మ ముచ్చటతో కావుటకు ఆశ్చర్యముంటుందా ?

337 – అది ద్వైతము కానిమ్ము, విశిష్టాద్వైతము కానిమ్ము, కేవలాద్వైతమే కానిమ్ము అన్నిటికీ ఆ రసస్వరూపమందే అన్వయము.

389 – అమ్మ ముచ్చటకు అర్హతనాపాదించే సూత్రము, ఆ సత్యమును గుర్తింపక వర్తించినచో ఉర్రితాటికన్న ఘోరముగా నర్తించటం సత్యశీలికి విజ్ఞాతమై పరితాపకరమౌతుంది. అది లోకానుగ్రహాకాంక్ష.

411–ఇంద్రియములు విషయములలోనూ, అవి మనస్సులోనూ, అవి బుద్ధిలోనూ, అది అహంవాచ్యములోనూ అది ఆత్మలోనూ కలిసినప్పుడే అమ్మతో ముచ్చటించుకొను యోగము అనిపించుకుంటుంది.

414 – అందుకొరకై యోర్పుతో యత్నించి విఘ్నములను నెట్టి కార్యకారణ వ్యాపారరహస్యము తెలిసి తాను సిద్ధుడగువరకూ చింతించి, చాతుర్వర్ణ్యమును వ్యవస్థాపన చేసుకొని ఆ యానందసిద్ధిలో సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్య పరమా దేవీకృపను ఉపాసకుడు పొందగలుగును.

430 – ఇదంతా లోకము వ్యక్తమగుచున్నంతవరకూ లేదు, అవ్యక్తములోచేరి "లోకంబులు లోకేశులు లోకస్థులు తెగినఁ దుది నలోకంబగు పెంజీఁకటి కవ్వల......నేకాకృతి వెలుఁగు సచ్చిన్మయమహాశక్తి" అపుడు వ్యక్తమవుతుంది.

450 – అప్పుడది సార్థకదృష్టి. అప్పుడది అద్వైతదృష్టి, "అహం బ్రహ్మాస్మి" అనుదానికి పుష్టినిచ్చే అమృతదృష్టి కేవలానందానుభవము అని అమ్మముచ్చట.

475 – "మనసు నిలుచుచోట మారుతంబులు నిల్చు। మారుతంబు నిల్వ మనసు నిల్చు। మనసు మారుతంబు మలఁగిన యాచోటఁ। దానె బ్రహ్మమగుచు దనరు" అను కూర్మయోగి మాటయూ అమ్మముచ్చటవలె, అమ్మ కృపతోనే జరగాలి.

558 – నాదబిందుకళలలో ఏది ముందు? ఏది వెనుక? అనే వివాద మెంతయున్నా, ఈ త్రిపుటిలో అభిన్నత్వమూ అనంతత్వమూ అనే భేదము లేనివే. కం + లాతీతి కలా, అను వ్యుత్పత్తిచే 'జీవనిష్ఠం సర్వకర్తృత్వం యత్కించిత్కర్తృత్వేన సంకుచితం తదేవ కళాపదవాచ్యం అష్టమం తత్త్వం' అని ప్రథమ స్పందమునుండి 8 వ స్పందముగా చెప్పబడినా (పరశురామ కల్పసూత్రము) పరారూపమునందు అభిన్నదృష్టి అనివార్యమవుతుందని సుఖాపేక్షతో, కవి అంజలించుటలో సగుణమూర్తియైనది పరాంబిక.

563 – ప్రేమయూ భక్తియూ పరమములో ఏకీభవించుటతో 'ముక్తి' అను మధురపద మేర్పడి, కవి జీవితము బ్రహ్మజీవితమైనది.

584 – కనుకనే ఆయాసములేని కొలుపు. ఆ కొలుపునకు ఫలముగా కులపాలన జరిగి శ్రీకవి అకులవైభవమో నాకకుల వైభవమో సకలకులవైభవమో, అమ్మా! అని చండిక నర్థించి,

596 – ఆస, అసూయ, గబ్బు, దురహంకృతి, స్వార్థపరత్వము మొదలైనవి లేని తన హృత్కమల మందిరములో అమ్మను నివసింపజేసికొన్నారు, శ్రీ ఈ. స. శర్మగారు.

రచన భావపూర్ణశబ్దశక్తితో సిద్ధాన్తస్రవంతిగా ప్రవహించినది.

నాచే రచింపబడిన 'శ్రీ రాజేశ్వరీ శతకమున' మిక్కిలి సంగ్రహముగా నుండుటచే, శాక్తసిద్ధాంతమున 600 పద్యములతో పరిపూర్ణమైన 'అమ్మతో ముచ్చటలు' అనే పుస్తకము, ఆంధ్రులకు అపూర్వ అఖండ శాక్తసిద్ధాన్త రసపూర ఫలప్రదానం చేసింది.

ఈ గ్రంథరచయిత శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారికి ఒరిస్సానివాసి ' శ్రీ సర్వజ్ఞో – మృత్యుంజయ త్రిపాఠిశర్మ ' గారి ప్రశంస ఇతఃపూర్వమే ఉండగా, నేను నా నమస్కారములతో సిద్ధపరిచయం చేసికొనుచున్నాను.

ఇట్లు,

పాతూరి మధుసూదనరావుశాస్త్రి.





గ్రంథకర్త:

శ్రీ శ్రీయానందనాథాపరనామధేయ

ఈశ్వర సత్యనారాయణ శర్మ

శ్రీమాత్రే నమః



# కృతిసమర్పణము

ఇచ్చుట పుచ్చుకొంటయును నీఁబడు దిన్నును నీవె కాఁగ, నే
నిచ్చుట నీవు కైకొనుట యెట్టిదో? యైనను ద్వైతబుద్ధితో
ముచ్చటలాడుకొన్నపుడు పోదది కావున నెయ్యమొప్ప నీ
విచ్చిన వస్తువే మఱల నిచ్చెదఁ గైకొనుమమ్మ! శాంభవీ!

నన్నే నీకిడు నబ్బెసమ్మెపుడొ సన్ధానించి యేల్కొందు; నా
కున్నే నాది యటంచు నిచ్చుటకు; వేఱొండేదియే నీయ వె
న్గన్నెఱగానఁగరాదు; సార్థకనమస్కారాకృతుల్ సత్కృతుల్
నిన్నుం జేర్చుటకన్న, నా సుకృతి యన్నెంబున్నె? సర్వాంబికా!

ఇచ్చుట కేనిఁ బుచ్చుకొననేనియుఁ గోరఁ; ద్వదంకమందుఁ జో
టిచ్చినఁ జాలు; ముచ్చటల కింకెడమీయని తావదాట, నీ
యచ్చునఁబడ్డ ముచ్చటల నాఱుశతమ్ముల మాత్ర మిప్పుడే
ముచ్చటతీఱ నచ్చెదను; ముందటి ముచ్చట నీకె వీడితిన్.

శ్రీ శ్రియానందనాథుఁడు
ఈశ్వర సత్యనారాయణశర్మ

# శ్రీ చక్రము



శ్లో॥ చతుర్భుజే చంద్రకళావతంసే!
కుచోన్నతే కుంకుమరాగశోణే!
పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణ
హస్తే నమస్తే జగదేకమాతః.

శ్లో॥ శ్రీవిద్యాం జగతాం ధాత్రీం సర్గస్థితి లయేశ్వరీమ్.
నమామి లలితాం నిత్యాం మహాత్రిపురసుందరీమ్.

శ్రీమాత్రేనమః

# అమ్మతో ముచ్చటలు

1

శ్రీ తాలాంకనిశాతలాంగలముఖాకృష్టంబుగా, లాంగలీ
స్రోతస్సొప్పును; దాని తూర్పుదరి మించున్ శోభఁ జారిత్రక
ఖ్యాతింబొందిన శ్రీకాకుళంబె, మన యిక్కోటన్ సదా ముచ్చట
ల్నీతో నాడెడి సాధనస్థ్వాడని నన్దీవింపు రాజేశ్వరీ!

2

శ్రితభక్తావనకల్పభూజ! విబుధశ్రేణీసమారాధితా
ప్రతిమానారుణపాదయుగ్మజితనవ్యప్రస్ఫుటాంభోజ! ని
ర్జితదేవారిసమాజ! యోగిజనతాసింధుకుపారాజ! సం
సృతికాంతారదవాగ్నిబీజ! పదనీరేజాశ్రితాంభోధిజా!

3

నిరతహ్రీంపదపూజనాదరసుహృన్నీరేజరోలంబ! దు
స్తరసంసారమహాంధకూపనిపతద్భక్తావళీజీవనో
ద్ధరణామేయకృపావలంబ! అభీతాంతర్యాగనైపుణ్యసం
భరయోగీశకదంబ! సర్వజగదంబా! శుంభవిధ్వంసినీ!

4

♦ అమనోవాగభివేద్యతత్త్వమయి, సర్వాంతశ్చిదాకారమై,
కమనీయంబయి, నిత్యమై, యమలభక్తశ్రేణి కాధారమై
విమలానందవిధాయియై, సకలసంవిద్రూపమై యొప్పు నా
కది మహాశక్తిని మాతృభావమున నెక్కాలంబు సేవించెదన్.

---

♦ ఈ గుర్తుగల పద్యములు తొలికూర్పున ముద్రింపఁబడినవి.

5

♦ జననీ! యింద్రియపంచకానుభవదృష్టంబై, సదా దాని మిం
చినదై, యిట్టి, దిదే యటంచు నెవఁడుఁ జెప్పంగరానట్టిదై
మనముఁ స్వాభిముఖంబుఁ జేయునదియై, మన్నింపఁ బ్రేమింప నొ
ప్పినదై, శక్తి యొకండు తోఁచు నది నీవే యన్నఁ దప్పా? ఉమా

6

♦ విశ్వము నింటిపట్టెది, యభేద్యము నేది, యనంత మేది, స
ర్వేశ్వర మేది, సన్నిహిత మేది, గుహాచర మేది, భక్తహృ
చ్ఛాశ్వతసౌఖ్యదాయి యెది, సర్జనకర్తృక మేది, యింద్రియా
ఖ్యాశ్వనియంత్రి యేది, యదె యమ్మయు నయ్యయు నమ్మువారికిన్.

7

♦ ఆంగిరసాంబరీషయువనాశ్వఋషిత్రయిఁ గూడి లోకమం
దుంగడు విస్తరించె హారితుండను సన్మునిగోత్ర మమ్మ! త
న్మంగళగోత్రినౌ టలుపమా? హారితుండను పేరు సార్థమా
యెంగదె, పుట్టఁగానె "హారిమేత్యయ"యంచు ఋషుల్వచించుటన్.

8

♦ నాన్నది తెచ్చి పెట్టు పని; నాపని విందులమంద కేవలే
కన్నము పెట్టుటంచు, నొకయప్పుడుఁ గోపము లేని సాధ్వి, న
న్గన్నది కామమాఖ్య; తన నడ్వది యన్నుల కొజ్జబంతియై
మన్నది, నిన్నుఁ గాఁదలఁచి మన్నటు లామెకె మున్న చేసెదన్.

9

♦ పారంబంటఁగ నాయురాగమము నేర్వంజాలి, శిష్యాళికిం
పారం బాఠము సెప్పఁజాలి, నుతమా త్యాగంబు భోగంబునన్
వైరాగ్యంబును గల్గి, ధర్మపరత న్మన్నట్టి నాతండ్రి, సీ
తారామాభిధుఁ డగ్రవంద్యుఁడు భవద్భక్తుండు; రాజేశ్వరీ!

10

♦ కాయంబిచ్చెను; పోషణాశ్రమముఁ గొనెన్; గాయత్రి నందిచ్చె; పూ
తాయుర్వేదరహస్యశిక్షణముతో నధ్యాత్మమార్గమ్మునన్
జేయూఁతిచ్చె; గురుత్వశేవధికి నాపుణ్యంబుఁ దెల్పెన్ సుఖో
పాయమ్మున్నదె భక్తితో నతులు తప్పన్; సర్వదేవాకృతీ!

11

♦ నాయడయ పుత్రలబ్ధికి ననారతభక్తిని జేసె సత్యనా
రాయణపూజ; తత్ఫలమనై జనియించిన నన్ను సత్యనా
రాయణశర్మ యంచు వ్యవహారము చల్పిన తండ్రి దీవెనల్
నీ యమలాంఘ్రిభక్తునిగ నిక్కము నన్నొనరించె; శాంభవీ!

12

♦ కరుణను ఋక్షరాడ్గ్రహణకాలమునం బిత దక్షిణాస్యమం
తరముఁ బదేండ్ల పాయమున దానము సేయఁ దదీయరూపవై
గురువులు వాఱు నీపదముఁ గొల్వు నదృష్టముపట్టె; నట్టి య
య్యా రవడిఁదీర్చ భక్తినిరతాంజలి చూపుమనమ్మ! చాలదా?

13

♦ చిననాఁడే జనకుండు చూపుచు నిన్నున్ శ్రీరుద్రకోటీశ్వరాం
గన, రాజేశ్వరి యస్మదిష్టము సుమా; "కావ్యాహారన్నార్చన
మ్మున మోసంపడఁబోకుమా," యనిన యామూర్తంబుగోలెన్ గద
మన యీముచ్చట లెత్తికొంటి మిది సంస్మార్యంబు, రాజేశ్వరీ!

14

♦ సద్యోజాతసతీపదాబ్జమధుపున్ సౌమ్యున్ సదాచార్యు, శ్రీ
విద్యానందు, ద్వివేదివంశశశి, నుర్వీదేవమూర్ధన్యునిన్
హృద్యప్రజ్ఞుని, లక్ష్మిదత్తు నెపుడున్ సేవింతు; సచ్ఛిష్యులన్
సద్యఃసిద్ధులఁ జేసి నట్టి ఘను నుత్సంగమ్మున న్నిల్పితే?

15

♦ ఏయనవీసురుండు రచియించిన కావ్యము లెల్లఁ దొల్లి నా
కాయుత కౌతుకప్రదము లయ్యెనొ తెన్గునఁ గైత సెప్పఁగా;
ఆయన శేముషీగురుఁ డుపార్జితకీర్తి జయంతి భావనా
రాయణ నా నమస్సులు నిరంతరముం గొనుమఁ గావ్యరూపిణీ!

16

♦ నీవును నేను నొక్కటని నీవనఁ జేసిన కాళిదాసునిన్,
నీవరచక్రపీఠము లనేకము నిల్పిన యాదిశంకరున్,
భావనశాస్త్రసిద్ధవరివస్యరహస్యముఁ దెల్పు భాస్కరున్
నా విధి యంచు మ్రొక్కెద వినమ్రుఁడనై తలపోసి నిత్యమున్.

17

♦ ఏ నేమంబుల నిన్నుఁ గొల్చికొనిరో, యేరీతి ధ్యానించిరో,
యే నిష్ఠం దపియించిరో, యమృతసాదృశ్యంబుతోఁ గైతలన్
శ్రీనాథుండును బోతరాజు జగతిన్మెప్పొంది, రాకందువ
మ్మా నీ బిడ్డఁడు నాలకింపఁదగఁడే? ఈశాని! వాగ్వాదినీ!

18

♦ కలిలో మర్త్యుల కాంతరార్చనపు దత్త్వమ్ము లోటంచు ని
ర్మలులై బాహ్యము వైదికాంతరసమర్చాప్రాపకంబౌనటుల్
లి శ్రీచక్రమె సాధనమ్ముగను దెల్పంజాలి, రాయా మహా
త్ములు మా యన్నలు భక్తివంద్యులు కదా తొల్దొల్తఁ జక్రేశ్వరీ!

19

♦ స్థూలము సూక్ష్మమంచు నిరుచొప్పుల నొప్పెడి నీయుపాసనం
బోలిఁ ద్రయీశిఖోదితమహోన్నతవాగనుభూత్యవస్థయై
వ్రాలు పరాఖ్యరమ్యవరివస్యకు దారిగఁ గూర్చినట్టి వి
ద్యాలయులా మునీంద్రులకు నంజలిఁ గూర్చెద నమ్మ! సమ్మతిన్.

20

♦ అరరే! కాళులు రెండు గల్గు పసులారా! నీను లొగ్గుండు; మా
దురితంబూడ్పఁగ నంబికాచరణపాథోరాశిలో మున్గుచే
వెరవో; నన్యము లేదు; పూజ్యకవితాప్తింగూర్పఁగా, నంబ త్రి
పురమంత్రమ్మను కాళిదాసు నుడికిన్ సాష్టాంగముల్, కాళికా!

21

♦ పలుకుల కూర్పు తిక్క యెడఁబాయక నిన్గణుతింపఁజేయు; న
ప్పలుకులకల్కి నీవ యను పట్టునఁగల్గయు నేను నాదు ప
ల్కులు నను మాట; ఇంక మనసు స్మృతి వేఱను బెట్టులంచు నేఁ
గులుకుచునుందు; నాకుఱుకు కూడను నీవ యటంచు భారతీ!

22

♦ ముచ్చటలందు నిన్నిలిపి పూజలొనర్చెడి వారిఁబోలి, నీ
యచ్చపు ముచ్చటంగొనఁగ నర్హత లే, కెడలేని పుట్టు ని
క్కచ్చికి డస్సి, నీయొడిని గాయము సేరఁజిన్న కూర్కులో
వచ్చిన పల్వరాలివి శివా! విని నన్నిఁక నేమి చేసెదో?

23

అమ్మా! నీ వొకసారి వేడ్కపడి యీ యంత్రాస్యమందుండి, ప
ద్యమ్ముల్ గా మన ముచ్చటల్ త్రిశతసంఖ్యమ్మౌనటుల్ భక్తభా
వమ్ముల్ రంజిలఁబల్క, చెప్పెదను ముప్వందల్ మఱిన్ ప్రేమపూ
ర్వమ్మౌనట్లనినావు; తీర్పుమిఁక నా బాకీ వడిన్ శాంభవీ!

24

తల్లి వచించె; నీవె యవి దాచితొ? మా చెవిఁబెట్ట నీమనం
బొల్లదొ? తల్లి చెంత నభియోగము పెట్టెద; మమ్మ సొమ్మునం
దెల్లరు హక్కుదారులని యేర్పడి తమ్ముల కావిలంబ మా
తల్లిదె యంచుఁ జెప్పుమనెదా? మఱి చెప్పెదొ? వేగ శాంభవీ!

25

కటకట! పూర్వసిద్ధకవికావ్యసమాఖ్యలె, పొల్లుఁబల్కి మే
మటమట బుద్ధిఁగో మొగమునందిడినంతనె, నీకుఁజాలె? మృ
ద్వాటకముల న్గరండనిహితమ్ములు చేసి, "సువర్ణభైరవీ
పటకము" లన్నయంత గుణవైభవ మెట్టులు వచ్చు? భైరవీ!

26

ఇచ్చె నొకండు జాగతముశే యగు పొల్లుల నల్లి "అమ్మతో
ముచ్చట"లంచు, మా మతులు పోయెనె నమ్మగ? వాని నమ్మి నీ
స్వచ్ఛర మూడ్చుకోఁదలఁచె; పాపము నా యనుజన్ములందు నీ
రొచ్చెముఁ దెచ్చునే లతని యోగ్యపథంబునఁ ద్రిప్పుమంబికా!

27

పలుకు, ల్పలుకుట, పల్కు వ్యక్తియుఁ బరావాగ్రూపవౌ నీవె కా
వలపోయందగుఁ జేటలేని ముఖయంత్రమ్మందు నిస్సారవా
క్కుల రూపమ్మున దీనవేషమున రెక్కొ మక్కువంగొంట లీ
లలకే? వారికి నీదుతత్త్వమును దెల్పన్ రాదకే? శాంభవీ!

28

నీవే నేనయి డొక్కల న్నిలిచి, నిన్నెంచి, నీవైన లీ
లావైచిత్ర్యపు ముచ్చటల్ సతము సల్లాపింతు, వీసత్యమున్
జీవుండెన్న కహంకరింపఁగని, తజ్జిహ్వాన్ దుపాతుల్యవా
గ్భావాకారముఁ దాల్చి యాడుదువు నిక్కంబింతయున్; భ్రాంతీ!

29

తొలి వంతే తల యూఁపఁ జేసె, మలి వంతున్జూపి మాతృత్వభ
క్తుల నింకన్ జవి చూపవే, యనుచు భక్తుల్ కోరినన్ నీకటా
క్షులవాక్షేపము లేమి, ముద్రితశుభాకారాప్తికిం బాచి, బూ
జులు దుల్పించితి విప్పుడైనను గృతజ్ఞుండన్ నమస్సుల్; శివా!

30

పని లేశాడిన వెఱ్ఱి ముచ్చటలుగా భావించు వారెందఱో?
మనుజత్వాప్తిఫలంబిదే యనుచు సమ్మానించు వారెందఱో?
మనకుం గ్రుంగుసు బొంగు లేమి నవియమ్మా! గ్రాహ్యముల్ గావు; నీ
వనుశీలించినఁజాలుఁ బల్కినది నీవా, నేన? యూహించుకో.

31

వ్రాసిరి కాళిదాసకృతిరాజికి వ్యాఖ్యలు నూఱు; లందు నా
పాసనతత్త్వగుప్తి గల పట్టుల గంటము తేలిపోయెఁగా;
భాసగఁదోఁచు నీవిలువపై నగలంగని మోహమంది; రా
పాసవ వేళఁగావలయు నమ్మయె మూకసరైలి భారతీ!

32

♦ ఫలనతశాఖి యాఁకొనిన వామనమూర్తికి, నీఁతరాని దు
ర్బలునకు నేటి సద్మసు బ్లవమ్మును బోలెను దొంటి మేలి చేఁ
తల ఫలమై లభించితిక దా; యొక యొడ్డునఁ జేరు దాఁక, నా
తలపు మెఱి నిన్ను వీడ, భవతారిణి! వీలును గోలుపోదు నే?

33

♦ తన యాలికిన్ బురఖా ముసుంగునను గుప్తం జేసి, తా నన్యభా
మిని వైపట్టి మొగాదిగం గనెడి కామింబోలి నిర్లజ్జుఁడై
తన కావ్యములు దాఁచి యన్యకృతులన్ దాప్త్యమ్ములతోఁ జూచు మ్లే
చ్ఛుని, నీముక్కనులందు దేసఁగనెదో చూడంగదే, భారతీ!

34

♦ తీయని పాటకై తలుపు తీసెద నమ్మరో! నాదు నాల్కపై
హాయిగ నాదు నిన్పలుకులమ్మఁగ నెంచితి; నిల్వేడీయనీ
యూ యొడయండ్రకుంబలుకు లమ్మఁగనొల్లను; నిట్టుపాసమున్
జేయునె కాని గడ్డి తిన నేర్చునె మానిసి జేనపొట్టకై ?

35

♦ గేహేవీరుని శస్త్ర మాలపుఁదఱిన్ గేల్పట్టుఁగోల్పోవున
ట్లూహవ్రాతము లూరుచుండి కవితోద్యోగమ్ముఁ జాఱున్; స
మ్మోహాధీనము లౌచు; నూహములు సమ్మోహమ్ము నీపై శ్రితుఁ
డేహిన్ సంకటపెట్టి నీకరుణ సందిగ్ధప్రతిష్ఠమ్మగున్.

36

నడిచెడి జాము నాలవది; నాయమె కాయము నమ్మియుంట? యె
ప్పుడు కనుగొంటొ, భక్తకరభూషలు నొసలఁదాల్చు పూవులై
యడరునొ, నాదు కావ్యము లటుంచుము గుండెద నమ్మ! గొప్పకై
పడియెడి దుఃఖమో, విమలభావమొ, నీ కననేల? భారతీ!

37

♦ భారతివౌచు నాదు తలవాకిట వెల్వడినంత సంబరం
బా? రహిఁ మీఱి భక్తహృదయాబ్జము వీడఁగదమ్మ! శ్రుతి
ద్వారములందు దూరినఁగదా శ్రమ సార్థము; నాదు కావ్యసం
భారము మూల మూల్గుచును పాడయి పోవుట న్యాయమా? ఉమా!

38

♦ బహులను జెల్లిపోవు నొక వాచకపుస్తకపాళి వ్రాయఁ; వె
ప్పుడు భగవత్కథావళికె పోసెదు కాలధనమ్ము; భక్తిఁగూ
ర్చెడిది యుపేక్ష్యమే? యను సుహృత్తు లసమ్ముఖులంచుఁ బోకిఁ న
వ్వెడి ననుఁజూచి నవ్వెదవొ? వేడుకఁ జూచెదవో? సరస్వతీ!

39

♦ మినుకుతుదల్ ప్రమాణము లమేయభవన్మహిమమ్ముఁ దెల్ప; నీ
మనువులు నీ స్వరూప మనుమానము లేదు, మహార్యబోధచే;
జననియె యగ్రపూజ్య యన సందియమా యనుభూతిఁ బట్టె? కా
వున నికఁ నేరితో సుతుఁడు ముచ్చటలాడఁగఁడంగు? భారతీ!

40

♦ పడక న్నిద్దురవోవు వారలను లేపం బాపమే యైన, బి
డ్డఁడు ధర్మమ్మును దల్లి సౌఖ్యమును జూడంబోఁడు, సందర్భమున్
విడియే పల్కను; తల్లి యూఁకొను; నకే నేఁబిల్చినడ్డెల్లఁ బ్రే
ముడిఁ జయ్యంగదలంగఁబాఱె, విను మొప్పో తప్పొ నాముచ్చటల్.

41

♦ వృత్తులు నీవె యైనపుడు వేగమ వాతెఱఁద్రోసికొంచు న
చ్చొత్తినయట్లు పద్యముగనో శుచిగద్యము గానొ, సొమ్ము లిం
పొత్తఁగ గల్లుమంచుఁబయికూఁకిన యప్పుడె సమ్మదంబగున్;
తెత్తెతె - పెప్పెపే యయిన నీదు కృపాళుత యేది? భారతీ!

42

♦ ఓపిక యున్నచో విను మదుద్ధరభక్తినుతుల్ సతంబు, నీ
కోపిక లేదటన్న విడనొల్లను, నీకరుణామృతంబు నె
న్నో పలు లానినాఁడను; ననుంబలు మొండిగ నెంచితేసి, నా
కీపయిఁబుట్టువే యిడకు మియ్యదె సూ తగు శిక్ష; శ్రీగురూ!

43

♦ వెలఁదుల రిమ్మయున్, ధనము పిచ్చి, యశమ్మునఁ బిచ్చి, కూటివి
ద్దెల బలుతిక్క యిట్లు పలుతీరుల వెఱ్ఱుల కాసుపత్రి యా
నిలను ద్వదీయసత్కృప గడించు నుమాదము నాది; దీనిఁబోఁ
దోలఁజెడి వెజ్జెవండొరుఁడు దోఁచఁడు; మందును లేదు శాంభవీ!

44

ఒక్కెడ వత్సలత్వముగ, నొక్కెడ భక్తిగ, నొక్క ప్రేమమే
రెక్కొను వేళనో పలుకరింతలె గా మనమాడు ముచ్చటల్;
లెక్కకుఁదెచ్చుకొట్టు లవి లేసి క్షణంబెది? మూఁడు వందలే
యొక్కొక వంతుగా వెడలుచుండుట నా తలవ్రాఁతయో! శివా!

45

వటబదరీద్రుమంబులను బండ్లగతి స్మరయందు రేగు ము
చ్చటలు నగణ్యముల్; త్రిశతసంఖ్యలుగా బయలౌచునుంట, నా
నిటలము వ్రాత యన్నోయనటో, నీదు విలాసమొ, యంటో, తేల; ది
ప్పటికిటు లల్పతోషి నయి భవ్యము నీపయినుంతు భారతీ!

46

ముచ్చట లమ్మ యైనపుడు, ముద్రణభారము నమ్మదాను; నా
కిచ్చపలత్వ మేలనక, "యిచ్చెద నచ్చిన కిట్టె బైటికి
దెచ్చెద"నన్న యిచ్చగల తిక్క యహంకృతి రెచ్చి తెచ్చె నీ
యచ్చున నచ్చు నొచ్చెమును, నమ్మ యహంకృతి మచ్చమాపవే.

47

♦ ఏ నివసించు గడ్డిగదియే భవదాలయ; మందె యుండి నీ
జానుగులంట, నేర్పుగడి చాలని మాటల యేడ్పుతోనె నీ
మానసము న్గరంచెదను; మానిసు లెల్లరు గంగ యొడ్డునం
దే నివసించి మంత్రజపదీక్షను బూనగలారె? శాంభవీ!

48

♦ నీదు విశాలమైన యొడినే పవళించెద; అందె యుండి నీ
సాదరవాక్కుల న్ముదమునందెద; అర్ధమరేయి నీ మృదు
స్వాదుసుగాననిస్వనరసప్లుతిలోబడి నేనదెక్కడో
పోదును; తత్సుఖంపుటనుభూతికిం బోలిక లేదు, శాంభవీ!

49

♦ సాత్వికుల్ వత్తురె? భర్తతోడ నడురే సాక్షాత్తుగా వచ్చి, ఆ
దిక్షాంతాక్షరమాల "బోర వెనుకన్ దీపించుచున్ వ్రాసి" ఈ
యక్షుద్రకుక్కనె పూను మక్షయపలావాప్యర్థమై యంట; కీ
యక్షీణమ్మగు బిడ్డమక్కువకు సామ్యమ్మున్నదే? మాలినీ!

50

♦ పంచదశీత్రికూటములు వ్రాసిన పల్కుల చాల్పు మీద నె
క్కొంచి, గురుండు నీవు నిరుకేవలంజేయిడి నడ్వఁజేసి, "సా
ధించితి, యిల్లు సేరి"తని దించి కృపాబ్ధిని ముంచు నాఁటి ధ్యా
నాంచితదృశ్యము స్మరింతునా, జనులున్నను; భక్తవత్సలా!

51

♦ చిఱు దొంగాటల యర్థమింతెఱుఁగకే చిన్నప్పుడేనాఁడి, యి
త్తఱి నూహించితిఁ, "దల్లి ముట్టుకొనినన్ ధన్యత్వమే"లంచు, న
త్తఱిఁ గామాదికచోరవర్గమున కందన్ రాఁడో యీ మర్త్యుఁడ
త్తఱి శ్రీమాతను జేరఁ నర్హుఁడని యర్థమ్మయ్యెఁ గామేశ్వరీ!

52

♦ సుమనోమార్గముఁద్రొక్కి పోవు తఱి సంస్తుత్యక్రియన్ మధ్యమ
ధ్యమున న్మ్యాజలఁదన్వి నొంది, హిమధామాంశుప్రభాదీప్తహ
ర్మ్యమునం జేరి మహాసరోజశయనమ్మందీశు నంకమ్మునం
దు ముదంబొప్పఁగ నుండు నిన్నెపుడు చూతున్? శైవసౌఖ్యప్రదా!

53

♦ కాయంబీ భువి జాఱుటే మొదలు నీ కాంతాఖ్య నాదూడ, "అం
బా"యంచు న్మొయి పీసు దాఁక నను జీవంబాటనో, బ్రాహ్మణ
ప్రాయంబై జనభక్తిగౌరవసుపాత్రంబయ్యె; ఆ గోవు నే
తాయీ! నిన్నుఁగనెంచి మ్రొక్కెదను నిత్యమ్మున్ శుభావాప్తికై.

54

♦ 'తల్లీ! నిన్నుఁదలంచి'యంచు నొక పద్యంబల్లెఁబోతన్న; ఓ
తల్లీ! తత్పరమార్థ మెన్నఁగ షడధ్వస్ఫూతవాగర్థసం
పల్లాభమ్మును గోరువార, లదె రూపమ్మైన నిన్లేపి, హృ
త్ఫుల్లాబ్జమ్మున నిల్పఁజూతురని కాదో? మూలపద్మాశ్రయా!

55

♦ ఎవరుం ద్రొక్కని క్రొత్తదారులను నేనేగన్; జనుల్లేని దు
ర్గవనమ్మున్ జొరనమ్మనన్; కసెపుఁజీరల్ నేను దాల్పన్; గురు
ప్రవరుల్చూపిన దారి, నాపులు కుటీరమ్మందె, యీగుడ్డతో
నె వెసన్బోయెద; నుందు, నిల్తుఁగనెద న్నీజాడలన్ శాంభవీ!

56

♦ జననీ! చిత్తనువంది పద్మవనసంచారమ్ము పిండాండమం
దొనరింపంగని, స్వానుభూతుల మహాయోగుల్ ప్రశంసించి ప్రా
ర్థనముల్చేసిన మాటలే వినుతసూక్తంబయ్యె శ్రీపూర్వమై,
కనలే రెల్లరు నాంతరంబయిన యాగమ్మంచు, శ్రీం (ఈం) రూపిణీ!

57

♦ నీ సాక్షాత్కృతి లేని జాపము కన న్నిస్సారమై, గుండు లే
కే సద్దిచ్చెడి మందు కూరిన తుపాకింబోలి వ్యర్థంబగున్;
నీ సాక్షాత్కృతి చేరి గుండెగిరినన్ విక్షేపరోధాఖ్యదు
ర్గాసంభేదము చేసి సాధకుఁడు తాఁగ్రైకోఁడె యానందమున్?

58

♦ ఒక విధమైన మార్పు శ్రితునుల్లమున న్మొను జేయుదీ వదే
నికమగు సిద్ధి యంచు భ్రమశ్చితబుద్ధి నహంకరించు సా
ధకు గతి, బొమ్మవెంద్రుకల తత్త్వము నందుటా, పేనుకొర్కు వా
లక మగుటో యగున్, మఱికలంకమె దక్కును, నిక్క మంబికా!

59

♦ ఇతరులు పాడఁగా విని యదేవనిగాఁ దల యూఁచినన్ రస
జ్ఞత గలవాఁడటే? నిను నచంచలభక్తిని గొల్చి, చక్రసం
తతి కదమెట్టు నాదమును దా విని యాదల నింత యూఁపలే
నతఁడె రసజ్ఞుఁడౌ, నతఁడె యంబ! భవత్కరుణాప్తి కర్హుఁడౌ.

60

♦ నిను నెడ లేక యెంచు తటి నీళుల ముంచిన కుండనై, జల
మ్మునఁబడు పంచదారనయి, ప్రొద్దు వెలుంగున వెల్గు దివ్వెనై,
యనలమునందుఁ గాలు నినుమై పరమైక్యత నొందు వేళ, నా
యనుభవ మేరికిం దెలుపు టమ్మరో! యన్యము లేమిఁ బార్వతీ!

61

♦ సునిశితయుక్తితర్కముల చొప్పలు రేఁగుకొలంది, నీ స్వరూ
పనిహితమౌ రహస్యమది పాతుపడు న్మతికొంత; ఓ జగ
జ్జనని! కుతర్కముల్విడిచి సామయిమార్గము పట్టి నీమహా
మనువునె కొల్చువారల కమాయవుగాఁగనుపింతు, వంబికా!

62

♦ సుమములఁ గృత్రిమమ్ములను జూచిన యప్పుడు, వాని నైజగ
న్ధములును వర్ణము ల్మదికిఁ దట్టునటుల్, శివతంత్రసిద్ధయ
న్త్రములను మూర్తుల న్ననుగొనన్ బరతత్త్వము బోధసేయు యో
గ్యములని బ్రహ్మతుల్యులు మహర్షులుఁ గొల్చిరి వాని; శాంభవీ!

63

♦ అరయఁగ గంటకొట్టు గడియారముఁ బాడెడి గ్రామఫోనునై
నిరతము నిన్జపించినను నీ పరతత్త్వ మెఱుంగఁజాలఁ, డం
తరమున బీజవర్ణముల తత్త్వము శాస్త్రవిధిన్ గ్రహించినన్
'పర'యను పేర నొప్పెడి యుపాసన పట్టువడున్ పరాంబికా!

64

♦ పూజానిర్మలకుంకుమంబు నొసటన్ బొట్టుంచుకొన్నంత నే
నాజాడ్యాదుల నమ్మ పాపుననుచు న్నమ్మున్ సరే; వాఁడు వి
ద్యాజాపక్రియ నాజ్ఞయందు వికసద్బంధూకపుష్పాభఁగా
రాజిల్లన్ నినుఁ గాంచ నేరిచి, ఫలప్రాప్తిం గనుంగోఁడుమా!

65

♦సుమము న్జుట్టును, ఝుంకరించుఁ, బడు, లేచు, న్వ్రాలు సూచు, న్మర
దము చేకూర్చిన యంత మైమఱచుఁ దత్సాన్నైకచిత్తమ్ముతో
భ్రమరఁ; మ్మట్టులె నీదు భక్తుఁడు సపర్యాదత్తుఁడై తోత్ర, స
ర్వము నానందరసానుభూతిదశలో వర్జించు; శర్మాకృతీ!

66

♦ నాదోపాసనమంచు యంత్రరవకర్ణమ్ము ల్పెనంగించి, నీ
యాదర్శ రంజిలఁ జేయు వానివలెనే, యత్నప్రజంబూని నీ
యాదర్శలోఁగొను వార లత్తఱిని నీ కక్షమ్ము లర్పింపరే
నాదాత్మవ్యవసాయసత్ఫలము శూన్యమ్మేను, నాదాకృతీ!

67

♦ పులుఁగు నభమ్మునం దెగిరి పోవను ఱెక్కలు రెండుఁ దోఁకయుఁ
గలిసి సహాయమౌనటులు, జ్ఞానము భక్తియు యోగమార్గముఁ
గలిపియె బోధచేసిరి జగద్గురువుల్; వరివస్య వేళలఁ
దోలఁగగ నొప్పదిం దెదియుఁ దూర్ణ ఫలాప్తికి, సర్వసిద్ధిదా!

68

ఆ శ్రీచక్రమునందు సాధకుఁడు నిన్నావాహితం జేసి, స
ర్వాశాపూరకచక్రపూజ లటె, మర్త్యాశార్థమే చేయు వాఁ
డాశింపంగలఁడే విమోక్షమును? నీ యాథార్థ్య మెడ్డేని హృ
ద్దేశాభాసితమౌనె? పూజనమహోద్దేశంబు సాధించునే?

69

జననీ! కోటిశశిప్రభాకరతిరస్కారిప్రభ న్నిన్నుఁ జి
ద్ఘనశాంతి, మధురామృతాకృతిని స్నిగ్ధశ్యామ నొక్కింతగాఁ
గను నీభక్తున కీజగత్తునెడ సెగ్గంబై బహుత్వంపు వా
సన రోఁతౌచుఁ ద్వదైక్యవాసనయె శశ్వత్స్థాయియౌ; శాంభవీ!

70

దృష్టిమనఃస్థిరత్వములె తేఁకువ వేటరి యభ్యసించి, యా
కృష్టశరమ్ముతోడ గుఱి నేయును దప్పక; ధ్యానశీలుఁడున్
గష్టము నాశ యమ్మనసు కన్నులిఁ బిల్కడతోడఁ గొల్వ, సం
తుష్టిని దర్శనంబొసఁగి తోడనె సిద్ధినొసంగవా? శివా!

71

గాలుల్ రెండనుకూలమా నెఱిఁగి నీ క్రమస్తుతుల్ చేసి, యా
నేలన్ నీనెలవేడనో యెఱిఁగి, నిన్ మేర్వద్రిశృంగమ్ముపై
కేలాగో కని, నన్ను జాఱినటు లేమెక్కించిన న్మెచ్చి, నీ
వే లాలించి వరప్రదాత్రివయి, మమ్మేల్కొందు దేవి! శివా!

72

నిను 'ఆయాతు' పదమ్ముతోఁ బిలుచుటే నిత్యన్; కటా! సందె వా
ర్పున; నీ రాకెటనుండియో, మఱల నీ పోకేడకో పిండమం
దనుభూతింగొన లేని మాకిదుదె సంధ్యాజపి! యాయుర్ధనా
దిని? సాయుజ్యము సిగ్గు లేకడుగ నిత్తే? వేదమాతా! శివా!

73

♦ అక్షరమాలతో నిను ననన్యమతి న్జపియించు వారి ఫా
లాక్షరముల్ దురక్షరములైనను, నయ్యవి మార్చి నిత్యము
ద్దాక్షరముల్ పొసర్తు, వది యీ విధిపట్ల విపక్షమౌనె? ప్ర
త్యక్షము పక్షపాతము శ్రితావనదీక్షను; త్ర్యక్షరాత్మకా!

74

కరవాలాంచితహస్తఁ గాళికను నిన్నన్నంతనే భీతుఁడై,
మురళీహస్తను గృష్ణరూపఁగని నమ్రుండైన భక్తుండెటుల్
పరతత్త్వజ్ఞుఁడు మృత్యుభీరహితుఁడై భాసిల్లు? ఆ శ్యామసుం
దరుఁడే నీవని యెన్నఁగల్గునపుడే ధన్యుండగున్; గాళికా!

75

విద్య లనెన్నియైనఁగులవిద్యకు రా వెనయందు పెద్ద; లా
విద్యలు జీవికాఫలదవిద్యలె; మా కులవిద్య యన్న శ్రీ
విద్యను నిన్ను నాకులము పేరఁబరఁగు సుషుమ్నలోని స
త్పద్యను బైందవమ్మునకుఁబంచుట దించుటె కాదె, కౌలినీ!

76

♦ ముడు వెడలింత, కూర్పు చెడిపోనటు గాలిని గట్టి, డాపలన్
గుడియును నంచు సాఁగ నెద నూల్కొనఁజేయుట సుస్థిరాసనం
బెడయక తన్మనస్కృత ఘటించుటయున్ గురుపాదసేవ చేఁ
బడయక దివ్యనేత్రఫలభాజను లౌదురె? సూత్రరూపిణీ!

77

♦ జాతీయమ్ములు గీతముల్ సదువనీ, సంగాదమే చేయనీ,
పూతామ్నాయజటాఘనాదిచణుఁడై పోనీ, మనుష్యుండు, వి.
శ్వాతీత న్నిను నాదబీజముగఁ దానన్నింటిలో నెన్నఁడే
నాతం డవ్వనిఁబాడు పెన్వొదురు బొంగన్నంతఁదప్పా? ఉమా!

78

♦ తరువుల నెన్నొ నాటి, యొక దానిని బాగుగఁబెంప లేమిఁ బం
టరయఁక కుందువాని గతి, నాసను మంత్రము లెన్నొ నేర్చి, సి
ద్ధిరహితుఁడౌటకంటె, పరదేవమహీజముఁబోలు నీదు మం
తర మొకటంది, నిద్దనుపు దారి జపించుట, తల్లి! మేల్గదా.

79

♦ ఇతఁడేదారిని ద్రొక్కె? ఆతని పథంబేదో? యటంచూఁగు వా
డతులభ్రాంతి నిజాధ్వమున్మఱచి, తప్పొ దారిలోఁజిక్కె, గ
మ్యతలమ్ము న్గననట్టు, లన్యవరివస్యామార్గజిజ్ఞాసువౌ
నతఁ డేనాఁటికి నిన్నుఁజేరును? దురాశాక్షిప్తుఁడై, శాంభవీ!

80

♦ నినుఁ బ్రాకృతిఁ గొల్చు సేయపడరక్ నీతత్త్వముం దెల్పు వీ
జనికాయార్థ మెఱింగి చక్రగణసంచారమ్మునే మెచ్చు న
న్నసయమ్మం బలుకంగులంగనెడి శాక్తాద్వైతినే యరాఁడు నీ
దినముల్ల్నాలుగుఁ బుత్తు నమ్మ! మఱి యీ దేహాప్తి శేషింపఁగన్.

81

♦ అక్కట! రైలుబండి ముఖయంత్రము క్రోసులు వేయి పాఱి, వే
డెక్కఁగ యంత్రశాల నిడ, నట్టిదె చల్లఁగ నౌను; గాని ఆ
నొక్క నిమేషము న్విరతి నొందదు నిన్నుఁ దలంచునప్పుడే
తక్కఁగ నామనోరథము, తానును నీదు స్వరూపమాటనో?

82

♦ అలజడులెల్ల దుల్లి భవదర్పితమై తగు భక్తవర్యు ని
ష్కలుషమనస్సె నీవయి, ప్రశాన్తము నైహికసౌఖ్యముల్ సుజ
న్ములకు నొసంగుదీ; వదియె నొక్కి వచించెను శౌరి స్వీయగీ
తలను విభూతియోగమునఁ దానె మనస్సనుచు, స్మనోన్మని!

83

♦ నిద్దుర కాని నిద్దురను నిల్చి మొకమ్మున ముద్దుముద్దుగా
సుద్దులు పల్కు నీదు సొగసుల్ మఱపౌనటె? అట్టి ముచ్చటే
పద్దున వేసికోఁదగును, భారతి! శాశ్వతసౌఖ్యమిచ్చు నీ
పద్దరదంబుజామృతము భావిసమీపమునందు నున్నటుల్.

84

♦ ధ్యాస లేకే యొకవేళ నోజనని! సంభాషింతు; వాయుంద మొ
క్కనినే తన్ను; నలంకృతాత్మవగు నీగానమ్ముతో లాస్య మీ
జనలోకమ్మునె తన్పఁగల్గు వడియే సారస్వతంబన్న; నా
ధ్వని తేవట్టి దదెట్టిదో తెలియ సాధ్యమ్మౌనె? వాగీశ్వరీ!

85

♦ ఆనుకబుఱ్ఱ నీట నడుగంటఁగఁద్రొక్కినఁ దేలిపోవు; అ
ద్దానికె బొక్కపెట్ట, నదె వారిని నీరము సొచ్చి తేలఁగా
నీనటు, నీదు ధ్యానరతి యింతగ నబ్బిన మానసమ్ము, నీ
లోన నడంగు లాఘవవిలోలగుణమ్ములు మాని, మానదా!

86

♦ నీదయ నొందు ముచ్చటను నిత్యమనోరణమాను; దానిలో
వాదె జయమ్మొకప్పుడయినక్కబలు గెల్పులు దానివౌట, ని
ర్వేదము నొంద కీవు కృప పేరిచి యిచ్చిన "సాహా"మస్త్రమే
యూఁద గడించుకొంటి విజయోన్నతి, నాజ్ఞను నిల్పి, అంబికా!

87

♦ ఉమ! నీదాసుఁడు నైజశీర్ష మొక విద్యుచ్ఛక్తి కేంద్రమ్ము, హ
స్తములుం జూపులుఁ దత్ప్రసారణకృదధ్వశ్రేణులై యొప్ప, లో
కము మేలొందన చూచు; స్వార్థపరదీక్షామాత్రుఁడై పోఁడు; సా
జమొ, నీయానయొ? తొంటి సిద్ధుల కథల్ సత్యమ్ము తార్కాణముల్,

88

♦ నీకరుణాకటాక్షరజనీకరకాంతులలో మునుంగ వా
ర్షికతమస్సు నాపయిని రేఁగని నాళులె నాకుఁ బున్నమల్;
చీఁకటు లల్లుకొన్నటు హృషీకబలమ్ములె, నిద్దలంపఁగా
నీక కలంచు నాదినములెల్లను నాకుహువుల్ కళావతీ!

89

♦ అరువది యేఁడు లేఁదలఁచి, యారసి, పెద్దలఁగొల్చి, దేశముల్
తిరిగి, కృతుల్పఠించి, విని తేల్చిన దొక్కటె – నీకృపంగనక్క
బరులకు మేలు సేయుట యుపాయము; దానిని మాని, జ్ఞాని యౌ
నరుఁడు మహాత్ముఁడన్న నుడి నమ్మను నమ్మను నమ్మ నమ్మికా!

90

♦ నీకార్యమ్ములు నీదుసృష్టి కెపుడున్ మేల్సేయుటే కాంచి, నా
కీకాయాప్తియు నందుకే యనుచుఁ బ్రార్థింతు న్నినున్; నాకు నో
లోకేశీ! యెద మేలుసేత వెరవుల్ సూపంగ; నాకయ్యదే
సాఫల్యమ్మగు బ్రహ్మసౌఖ్యమనుచున్ సంతుష్టితో నుండెదన్.

91

♦ మాతృకటాక్షమే తగిన మందనుచోట, సమాని నోము, ని
న్నాతురలోకసౌఖ్యమునకై శ్రమపెట్టుదు; దాన లాతి మే
ల్సేతయు నీదు గొప్ప నిరసించు వఘాత్మని వెఱ్ఱిమోము, నీ
పూతపదమ్ము వైపగుటె ముఖ్యఫలమ్ములు గాఁగ; శాంభవీ!

92

♦ సడలఁగ నీక నిర్మలమల సందున నిల్పఁగ నొక్కొకప్పుడే
నడుగకె నాహితంబరసి, యవ్వియు నివ్వియు వీణ మీఁటు స
ట్లడరెడి ప్రేమతోఁ జెవుల నల్లన నూఁదెదు; నీదు బిడ్డపై
నుడుగని ప్రేమకుంగుఱుతు లుండునె యింతకు మించి? భారతీ!

93

♦ గదులను బేదవారలను గవ్వయుఁ గోరక మందులిచ్చి, ని
ర్గదులను జేయఁ జూచు పని, కన్నులు మోడ్చి స్థిరాసనమ్ముపైఁ
గదలక జాపముం జలుపు కార్యముకంటెను జిన్న గాక, నీ
దు దయ గడించు మార్గమని తోఁచును జన్మరుజాపహారిణీ!

94

♦ క్రుంగును బొంగుఁ గన్పడవు కూర్కున; స్వప్నము నందు మెల్కువం
దుంగనవచ్చు; నాయునికి తోఁచవె తోఁచదు కూర్కునందు, భ
క్తింగడు నిన్నుఁ గొల్చుతటిఁ, గేవలభక్తునిఁ జెంతకీడ్చి పా
లంగుడువంగ వేళ యదె లాగునఁ దోఁచును, భక్తవత్సలా!

95

అన్నంబందుఁ నోషధీతతిఁ, దేహంబందు నీశక్తి సం
పన్నంబౌటను విస్మరించి, జడుఁడౌ వైద్యుండు సేవించుఁబూ
నొక్కన్న నెగ్గునె! ఒక్కసారి భవదుద్యన్మాతృమంత్రమ్ముతో
మన్నై యిచ్చిన జీవనౌషధముగన్ మందేల? సర్వేశ్వరీ!

96

తెగుల్ఁబోలిచి మంచి మందు లిడినన్ దేలండొకం; డొక్కఁడే
తెగులు ల్లేకయె చచ్చు; మందు తినకే తేలున్మఱొక్కండు; నే
నగదంకారుఁడ నన్నగోటి మిగులై, వ్యాధిప్రకోపప్రశా
న్తిగతుల్ నీకరుణావిశేషగతి నిర్ణీతమ్ములౌ; శాంభవీ!

97

“మనసా! మున్గుము మున్గు వేసరక శ్రీమాత్రంఘ్రినిర్ణేజనా
బ్ధిని, దద్వాత్సలతాంబుధిన్, సకలధాత్రీదివ్యసౌందర్యవా
ర్ధిని; గన్గొందు వపూర్వరత్న”మనుచున్ ధీరత్వముం గొల్పి, ముం
చినఁ “గంటిన్ జెయి కందంచు” మునుఁగుచున్ జింతాబ్ధిలో; నీశ్వరీ!

98

బలిమిని బండి యుండఁబిగఁబట్టిన కమ్మిని బోలి, సృష్టిలో
వలిదగు నంతయు నిలుపఁబట్టుగ శక్తివి; కమ్మి క్రాఁగినన్
నిలువదు పట్టు; మందపుదు నీళులె కావున, ధ్యానవేళలన్
జిలుకుచునుందు నాదు కనునీళులచే నిను, సర్వశక్తిదా!

99

వినుఁగను వేళ నాకనుల నీర్వెడదౌటను గాంతు వీవు; నీ
కనుఁగవ నొక్క బొట్టయినఁగానను; నేలని పిన్న కన్న కు
ఱ్ఱను నను నేడిపింపఁదగునా? ఉరకేడ్వకు, నీడఁజూచి బీ
తేనయకుమంచు నవ్వెద వదే నను నూఱడఁబల్కుటా? ఉమా!

100

♦ చెవులను హోరు, కన్నులను జీకటి బ్రహ్మబిలంబు పోటు, వే
డివలని దద్దురుల్వ్రాలువడె న్నినుc బ్రాణనిరోధకర్మతోc
దవిలి భజింప; దానిcగని దక్షిణుcడంచునో, జాలిచేనో, న
న్నవన మొసర్చినట్టి కరుణార్ద్రిత మర్వపు, చక్రవర్తినీ!

101

♦ పొదిచేర్పcదలిచెంతకున్వదలి క్రేపున్మళ్లి దవ్వైనచో
మదినాదూడకుcగల్గుసంకటమెము మ్మాతెనౌను, చక్రేశ్వరీ!
మదినద్దc బహిరాస్యమైనపుడు సమ్యక్తాపమే లేనివా
నిదిధ్యాసంబను టెట్లు? వానియెనసందీపింతువే యెన్నcడేc.

102

♦ నాటకపాత్రధారణమనc జిననాcడొక వెఱ్ఱి, ఇర్వదేం
డ్లేటికో? గొప్ప యంచభినయించి గ్రహించితి; నయ్యొ! మన్నడే
బూటకమంచు; నాcడె పసిcబూనితి నీనుతు లల్లుచుంజగ
న్నాటకసూత్రధారిణిcగనంగదు నక్కటతో నటేశ్వరీ!

103

♦ త్రికరణశుద్ధితో గురుcడుదీర్ఘకృపామతి నెప్డు హస్తమ
స్తకయుతిcజేసి నీమనువు జాన్గున వైచెనొ, నాcటినుండి, యం
గకమున మాటలో మది నొకానొక మార్పది నాకె వింత; దీ
నికిcబరసాక్ష్య మెట్టులగు, నీవును నేనును గాక, శాంభవీ!

104

కన్నులcజెమ్మలూరుటయుc, గంఠము గద్గదభావమొంది, మే
న న్నొతె పుల్కరింతలగు నాcటి దశందలపోయుచున్న, నేc
డున్నను నొక్కొకప్పుడు కడుంగను లోcగొను నాయవస్థలో
నున్నది నేనో? నీవో? మఱి యొక్కటో? యీముడి విప్పు, మంబికా!

105

కోర మఱొండు; నాకొక చకోరజనిఁ దయచేయు; మన్యవ్యా
హారము మాని, విష్ణుపదమందుఁ జరించి, మహాకవీందువి
స్తారితమైన చిద్గగనచంద్రికఁ గ్రోలుచు నిఁ బరాకళా
కారను గొల్చు చేతను గాంచి సుఖించెద నమ్మ! చిన్మయీ!

106

చరమోత్పత్తిని నీ పదార్చనమహాసౌభాగ్యలాభంబు, లీ
నరునింకేము నటన్న సూక్తి నిజమైనన్ మేలె; భోగ్యమ్ము ని
ల్వర మింతున్నను మేనొసంగు; మది కల్యాణమ్మె; నీసేవలే
దొరుకున్నట్లి, సుయోగ మయ్యదియుఁ గాదో, దుఃఖదంబా! శివా!

107

అవనికి డింపి తంత్రముల, నన్నిట ధ్యేయవు గాఁగ ధ్యానగ
మ్యవుగ నుతించినట్టి శివు ధ్యానము దేనిని గూర్చియా నభి
న్నవు తనకౌట? నిన్నె యని నమ్మిన ముగ్ధుల మమ్ము శాక్తబం
ధువులను బంధుతాగరిమతోఁ గని బంధము లూడ్పుమా, శివా!

108

♦ జననీ! పాపమదేమొ, యొక్కపుడు నీ జాపమ్ము మంత్రార్థభా
వనతో సాగదు; నాఁడు నాపడెడి తీవ్రక్షోభ మేమందు; భో
జనమా – యిందదు, నిద్ర పట్టదు, సమస్తవ్యాపృతుల్ సచ్చు; ని
కను సాగింతువె నీదు దాసుని పరీక్షాకాలమంచేడ్చెదన్.

109

♦ అమ్మిక! నీ శ్మశాన నిలయాఖ్యకు వెఱ్ఱిమొగాలు, వల్లకాఁ
డిమ్మని చెప్పి, యచ్చటికె యేగి జపమ్మొనరింప, సిద్ధి సి
ద్ధమ్మని యట్లచేసి పెడదారులు ద్రొక్కి నశింతు; రాశ్మశా
నమ్మన షట్సరోజముల నాళమటంచెఱుఁగంగ లే, కుమా!

### 110

దాత్రము సర్వసంకటలతాతతి ఖంచును సార్థమైన గా
యత్రిని చిన్ననాఁడిడుదు; రయ్యది శాక్తము కాదె? గుప్తగా
యత్రి భవన్మనుప్రవర, మయ్యది చేకొన శాక్తుఁడండ్రహా!
చిత్రము, నీకృపన్ బెడసి చీఁకటిఁగోఁబడె లోక, మంబికా!

### 111

నీ పదపూజవేళ విధినిశ్చితముద్రల పంక్తిఁజూపి, ని
న్నేపదిసార్లొ కొల్చిన నదేటికొ చూపెదు మానముద్ర నే;
చూపకు మాజ్ఞికమ్ములను; చూపు మయత్నసుసిద్ధమైన వే
వో పది సాత్త్వికమ్ములని బోధము చేయనో? చిత్స్వరూపిణీ!

### 112

చేసెడి నీ జపస్తుతులు చిన్నవె యైనను, నర్థయుక్తితోఁ
జేసిన యప్పుడే యవి సచేతనమౌ; నటు కానిచో వృథా
యాసమె యంచుఁదమ్ములకు నమ్మరొ! సాధకచక్రవర్తి నీ
దాసుఁడు కాళిదాసుఁడనె; దాని గణింప రదేమి పాపమో!

### 113

అన్యముపై మనం బరుగనట్లు జపింతమటన్న, మంత్రచై
తన్యము పేరి యర్థయుతి తప్పదు; దాన మనఃప్రసాదమౌ,
ధన్యతఁగాంతు, రమ్మఁగను దారి యదే చుఁడి; దాని కింతు ప్రా
ధాన్యమటంచు నేర్చినను దాని గణింప రదేమి పాపమో!

### 114

సాహంభావవిశుద్ధసాధకులకున్ సారూప్యమీవిచ్చినాఁ
హాహా! "నాసతి యెవ్వరిందని" శివుం దన్వేషముం జేసి, స
మ్మోహంబందని యానవాలుఁగను, మున్మున్నీవె ప్రేమన్ భవ
ద్దేహార్థం బలికించుకొంటివట తద్దేహార్థమందంబికా?

115

నీ తత్త్వమ్మును దెల్పు శ్రీపదముతో నిత్యార్చ్యయా దేవియే
నీతోత్రా? తదనూద్భవుండు బళిరా! నీ నత్తి మట్లాడుటా?
హేతుజ్ఞానము లేని మాకెటు విశీర్ణ హృద్గ్రంథి? మేలెంచి భా
వాతీతా! విడఁగొట్టు, నాధనామాజార్థమ్ముగా; శ్రీగురూ!

116

అంబా! మా పిత బిచ్చగాఁడెటులు కౌప్యాద్రిఁ గడించెఁ? గడిం
చెంబో; యుద్ధము వచ్చుటల్ బరసుఖశ్రీ నందలేరే? శ్మశా
నంబా మీకు విహారమయ్యె? నిట సంధానించుకోనా రహ
స్యంబుల్ సాధకపుత్రపాళి కొకులా సాయించువా? రంబికా!

117

♦ శ్రీరాజేశ్వరివీవు; నీయనుఁగు మంత్రిన్నేను; లోటేమియా?
సారైశ్వర్యపురాధిపత్యజనవశ్యత్వమ్ము లీడేఱె; ని
ర్వైరి న్నాకెట నడ్డు లేదు పెనుదారింద్రొక్కుచో; నీదు స
త్కారుణ్యంబె బలంబు; నన్వీడకుమా, గాయత్రి! గేయప్రథా!

118

♦ సతతమనోజ్ఞపద్మవనచారిణి! పద్మిని! మన్మనోమధు
వ్రతము పిపాసితంబు, మకరందభరాంబుజ మందుదాఁక, ని
గ్గతి భ్రమరాఖ్యమై తిరుగుఁగాన సహస్రదళాంబుజాతసం
స్థితి నిడి తన్ను మోమధుమతీ! యెటఁద్రెళ్లునొ, దీనదీనమై.

119

♦ అమవస చూడ్కినో, చలనమందని పున్నమచూపులోనొ, పా
ద్యమి కనుబాటునందొ, నిను నారయ లేని దినమ్మె దుర్దిన
మ్మమ! సతిమూర్తిగానొ, యొక యుత్తమతేజము గానొ, మంత్రరూ
పముననొ దర్శనమ్మిడుము, పాయక యన్ని యవస్థలందునన్.

120

♦ ప్రతిపన్మ్రఖ్యాకళానిధానమయి, శశ్వత్ స్థాయివై, 'సాద'నా స్తుతవా నీవు సదాశివాఖ్యపరవస్తువ్యగ్రవై, చంద్రికా ప్లుతసౌధాగ్రమునందు నిల్చుతటి మీపూతాంఘ్రులన్మన్ని, నా స్థితియే నేనెఱుఁగంగ లేని సుఖమందే తేల్చుమమ్మా! ఉమా!

121

♦ సరదాతో మెఱుమట్లు పద్మవనిలో సంచారముంజేయు, ని న్నరయంజాలను గాని, కల్పవనిలో నాత్మేశుతో నున్న నాఁ డరయ్గ లేనకొ? నద్మ మీసుతుఁడనై యాశుక్ర క్తంబు నీ చరణద్వంద్వమునందు లీనతను గాంచన్లేనె? చక్రేశ్వరీ!

122

♦ సురవరవందితా! త్రిపురసుందరి! త్వద్భజనాప్తి ప్రాణికిన్ జరమభవమ్మునందె, యను సాధువచస్సును నమ్మి క్రొమ్మెక్కఁదన్ ఎరగుట లేదు నీకు నిజమింతయు వెన్కటి పుట్టులందు; నీ కెరగుట యుండదింక; నిపుడే కయిమోడ్చెదనన్ని జోతముల్.

123

♦ తన పని యన్యబాధకవిధమ్మున మారాతేన వెంటనే కనుం గొని సవరింపనున్న నొనగూడును మచ్చ యటంచునో, సృజిం చిన మల వేడి తగ్గఁబయిఁజెట్టుల దట్టముగాఁగఁబెంచి, చ ల్లని వలికెన్నొ కొండసెలలన్ సృజియించితివమ్మ! నేర్పునన్.

124

♦ అతికఠినాద్రిరాజతనయాత్వము నొందిన నీదు మానసం బతిమృదుతన్వహించుటది యుత్రమె? పార్వతి! నీదు సృష్టిలో నతిమృదులాత్మలందుఁగఠినాత్మలు పుట్టఁగఁబన్నినట్టి నీ యతితరమౌ వ్యతిక్రమము లన్వయసిద్ధములౌ? మహేశ్వరీ!

125

♦ మనుజు తెప్పల్లోల పనొక సుందరి కావలెంగాని, ప్రిల్లికే
దో సలక గల్ల, గడ్డి తిని తోడనె క్రక్కన మానునంచుఁ జె
ప్పిన దేవరమ్మ! లోనలదు విశ్వవిభాయిని! నీవె నీదు స
ర్జనపరిరక్షణక్రమవిచారము చేయుచునుందు వార్ధిపై.

126

♦ నినుఁదలపోయు వేళ యని నిద్దుర లేపెడి యెఱ్ఱజుట్టుపుం
జునకిదె జేజె; తప్పు ములు చూపని సద్ఘటికారమట్లు చే
సిన దేవరమ్మ? నీ యఖిలసృష్టికి మేలె ఘటిల్లునట్లు చే
యని దొకటున్నదే? పరదయాకరి! శ్రీకరి! కుక్కుటేశ్వరీ!

127

రే చూపే యిడి కొన్ని జంతువులకుఁ, రేచీఁకె కొన్నింటికిఁ
రేచూపు న్పగలింటి చూపునిడి కొన్నింటి న్దమింపఁబోచు నీ
వీ చాతుర్యము, "సృష్టిలోపల వెలి న్వీక్షించి రక్షింతు నే
నే చూ" యంచును దెల్పుచుంటకె ప్రదర్శించితే మొ? లీలావతీ!

128

నిను ధ్యానించు చభిన్నతన్మదిని సంధానించి మోదించుచుఁ
ఘనమౌ సాత్త్వికభావసిద్ధినగు నాకన్నీటి మిన్నేట, మ
జ్జనమౌ వేళను, నన్నుఁగూడుకొని సుస్నానార్ద్రివౌ టండుఁద
ప్పునె నీకుఁ? గుఱుతించు టెట్లనుభవంబుఁ జెప్పవే, శాంభవీ!

129

♦ ఎక్కడఁ బ్రేమవల్లి కొనలెత్తెదో యక్కడఁగాలు పెట్ట; విం
కెక్కడ మచ్చరాలు తలయెత్తునో యక్కడ నిల్వనొల్ల; విం
కెక్కడ భక్తికి న్మలినమేర్పడు నక్కడఁగాపుదింప; వీ
వొక్కెడ నుందు, వేడ సుగుణోన్నతి మూఁగునో, యాడనే; రమా

130

♦ హరుఁజేపట్టఁ దపంబు నూను తఱి నాకాకైనఁ జేకోని ని
ష్ఠురతంబూని యపర్ణవైతివి; నను శోధింపఁగా నేమొ, యీ
నరజన్మంబిడినావు; కష్టతపముంగావింప నేనోప; నే
కరణిం జూచిన నీకపర్ణుఁడను నేఁగాఁజాల; శైలాత్మజా!

131

♦ నీమృదుపాదపద్మసుధ నిచ్చలు నంగముఁ జెమ్మచేయు. నీ
నామసువర్ణమాత్రములె నమ్మికఁ దోఁచును మందు గాఁగ, నా
యామయ మాఁపుచోట, గుణ మల్పమె యాటకుఁగారణమ్ము
ప్రేమసుధానుపానమది వెల్తి పడంగనా యేమొ; పార్వతీ!

132

♦ ఖ్యాతి గడింపనీ, కడు మహాత్ముఁడంచు జగమ్ము కొల్వనీ,
నీతులు పల్కనీ, జనని! నీ నుడియా శ్రుతి నీవుగా నెవం
డేతఱి నెన్నకే దవుల నేగు చహంకృతి రెచ్చి పల్కునో
యాతఁడు భూభరమ్మనుచు నప్పుడె గుండెగిరింతు; చండికా!

133

♦ అపయశమున్నచోట, సుత నమ్మి గడించెడి చోట, సత్యవా
క్యపగతమైన చోట, శరణార్థికి భంగము గల్గుచోట, సా
ధ్వపకృతి యైనచోట, సదయాళుత మీఱెడి చోట, మన్ప్వవి
త్రపమయి పోవుచోట, లలితా! మఱుఁగాదువు; శీలమోదినీ!

134

♦ ఆఁకటి బాధ బీదకు, ధనాఢ్యుఁడజీర్ణరుజుండు; పేదకుఁ
దోకము లెంతొ మంది; ధని తొయ్యలి గొడ్డుది; గానొనర్చు నీ
పోకడ యర్థవంతమె? విభుత్వము కద్దను బెట్టి కాని, ని
ర్వ్యాకులమాచు నీదు ప్రజ భాసిలఁ జూడవదేమి? ఈశ్వరీ!

135

♦ అమృతస్యందిసరోజరాజము కదా, అమ్మా! భవత్పాద; మ
య్యమృతమ్మే కద నీదు నామ; మది బాహ్యాభ్యంతరాస్మచ్ఛరీ
రము సిక్తమ్ముగఁ జేయకుండెపుడు? నోరక్షామందు లేఁ గ్రుంగి, రో
గమడంపన్ దలకొన్న నీ సుతకటాక్షం బేది? చక్రేశ్వరీ!

136

కాళీ! యంచును బూజ సేయువఱకే కాళీత్వముం బొంది, మా
మ్రోలన్నిల్చెద; 'వమ్మ!' యన్నపుడు మాపుత్రత్వ మొందుండి, యా
పై లుప్తమ్మగు నద్దియున్; బిదప నాద్వైతమ్మునుం జాలు; నే
నే లేనప్పుడిఁ కేమగున్? జనని! చణ్డీలీల యింతే కదా!

137

తన మెయి సబ్బుతోఁ గడిగి తాల్చు ముసుగుల; నింట ధూళిమా
ర్జన మొనరించి యాసనము సర్దుకొనున్; నినుఁ బిల్చి మానసా
సనమున దుష్టవాసనరజస్సుఁ దొలంపని భక్తవేషియా
తనయుని పూజలెల్లను వృథాకదె, నీవట లేమి నంబికా!

138

అమ్మా! మముం గలంచు పరమాపదలం దొలఁగింపుమన్న వా
జమ్మలఁ గూడి, మేముఁ "బరమాపదఁ బెట్టకు" మన్న యట్టి వా
క్యమ్మున "అమ్మ నేమఱుట యన్నదె మా పరమాపదర్థ" మ
ర్థమ్ముల నీకుఁ దెల్పు నపరాధము సైఁపు; పదార్థరూపిణీ!

139

దినదిన మంగుళమ్ము కొలఁదిన్ దఱుఁగొందు వివేక మొక్కటే
జనకులఁ బూజ్యులన్ దృణము చాడ్పునఁ జూపెడు; నట్టి చిత్తమే
యనువున నీయెడం దిరుఁగు నమ్మరో! యమ్మతనమ్ము పుత్త్రజీ
వనకృతకృత్యతాఫలవిభంగక మాటది ధర్మమా? శివా!

140

మన బాంధవ్యదృఢత్వముం దెలియకే మన్నాఁడఁ గొన్నాళ్ళు, నా
చిననాఁడిచ్చిన సందెవార్పు నుడులన్ జింతించి యాథార్థ్యమున్
గని, నేఁ బిల్చిన యంతఁ గాదనక రాకల్ పోకలుం జల్పు నం
బనుగా నెంచి, యభిన్నతన్ దెలిసి సేవల్పూనితిన్ శాంభవీ!

141

అలవడి పోదు మేము, యెవ్వరైనను ధారుణి నెన్మిదంగముల్
దల్చఁడ మ్రొక్కరే; నపుడు తప్పునె? నీకిటు లెక్కలేని భ
క్తు లెరఁగు వేళ; నంగములతో మనసున్నదొ లేదొ చూతువు, వా
తెలివి మూళిక్క మూఁకగుటఁ దెక్కలిఁ జిక్కుటఁ దప్ప దంబికా!

142

తనతో నెన్నఁడు లక్ష్మికిన్ గరుడుపైఁ దావిచ్చునట్లే, విరిం
చనుఁడున్ వాణికి నంచవెన్నున నెడన్ గాన్పించు, శంభుండు నీ
కనుఁ జోటిచ్చు వృషేంద్రు వీపుపయిఁ, గొంకుం దీర్పుమా; నీదు వా
హనమా సింహము నెక్కనీయ విది మర్యాదా? సతీతల్లజా!

143

అనపాయాప్తకళత్రుఁడొక్కఁడును, భార్యాయుగ్మఁ డొక్కండు, నీ
తనుజాతుల్; గురుశంకరుం డెటులు నిర్ధారించెనో వారలన్
వనితాసంగ మెఱుంగరంచు గుహభావమ్మెంత గుప్తమ్ముగాఁ
గ నెటుల్ శంకలు తీఱు, మా కఖిలమాతా! తెల్పవే, శాంభవీ!

144

కృప నీలత్వము నతురతుణమునం గీలించి, యీ నీదు యం
త్రపటుత్వమ్మును గాంచి తేఁ జెడదు; వ్రాత లూర్పులు నిన్నుపహా
త్వపవిత్రోక్తి వికాసముల్ చలుప శక్తింబాను; గాయత్రి మా
త్రిపురాదేవి సుసార్థకాఖ్య యను కీర్తిం బొందు దీవున్; శివా!

145

సలిలజాతపుష్పములు శారదవంతము లెన్నొ సృష్టిలో
మొలసిన, నీపదమ్మునకు, వేయిటి చిత్తము పేరి కాన్కగన్
జలభవమైన పద్మమున నాటిగఁ బల్కు కవీశు భావముల్
దెలిసిన వాఁడె చిత్తమును నీకిడఁజాలెడి భక్తుఁ డంబికా!

146

అనుకొనకున్న వాక్కపు డయత్నసుసిద్ధము లౌటయున్ దలం
చిన వేళ వేళ నిష్ఫలతఁ జెందుటఁ జూచియు, నాగ్రహమ్ము న
న్నలమును; చిత్ర మయ్యది, యహంకృతియో, భవదీరణమ్మొ, నీ
విలసితమే యెదైన నలవే తలపోయఁగ మాకు? శాంభవీ!

147

గిరివర మెత్తెఁ గృష్ణుఁడని కీర మవంగనె, రాధ శక్తిసం
చరణము చేయదే నతఁడు శక్తుఁడె? యంచును గోర పల్కు; నీ
వెరుపున భేదకల్పన మభేదమునందగు, నేను లీలలన్
జరిపెదు నంతకంచుఁ బ్రియసంతతి కీవె వచింపు మంబికా!

148

పితృవనము, న్నగవ్యాపుటభేదన మన్ను, సుమేరువన్ను, రా
జతగిరి యన్ను, శీతగిరిసానువులన్ను, ప్రయాగము, న్నభీ
ప్సితమగు నీవిహార; మొక వేడుక తీర్పుము నీదుపాదుకా
ద్వితయము మోచు నిష్టశమభృత్యునిగా నను నేలుటే; శివా!

149

ఒప్పుల కుప్పవంచు శ్రుతు లుగ్గడ చేసెడి లోకమాత, వీ
తప్పుల కుప్పఁ గను కతంబిదె - తొంటి బహుత్వవాంఛితం
బిప్పుడు తప్పినన్ మఱల సృష్టికినా సర కేది? పెద్దలై
యెప్పుడుఁ దొంటి స్వేచ్ఛ కెదురేగరు మళ్లి, యథార్థ మీశ్వరీ!

150

కోరికఁజంపఁగోరుటయుఁ గోరిక కాదకొ! నీవు జాగతా
కారము నొందు హేతువది కాదకొ కోరిక? మూఁడవప్పునే
కోరిక పుట్టినన్ ఫలముఁగోరని దానిఁగఁజూచి తేని, నీ
కోరికఁబోలి నాదియు నకర్తృ మకుత్సిత మౌను, శాంభవీ!

151

వెలపలి యంకపీఠమున విఘ్నహరుండగు నొక్క యన్న, డా
పలి తొడపీఁట శక్తియుతబాహుఁడు రెండవ యన్న యుండఁగా
స్థలమెది నాకటంచును విచారము లే, దిఁక విఘ్నశత్రుహ
స్తల కడవాఁడనై నపుడు నాకెడ నీ హృదయమ్మె; అమ్మరో!

152

చేయను, జేయకుండఁ దొలి చేసిన దానిని మార్ప, శక్తుఁడీ
వే యని శాస్త్రదృష్ట; మిపుడీఁగదె నీదు కరాంగుళీయకం
బాయజు కంటఁబెట్టి, భవదాజ్ఞగఁబూర్వము నానొసంటఁ దా
జే యహితంబు వ్రాసె, నది యిప్పుడ దిద్ద నొనర్తుఁ జండికా!

153

♦ శ్రితులంబ్రోచెడి కార్యమందుఁగడు నిర్నిద్రంబు నీ దీక్ష; దు
ర్మతితో విస్మృతిఁగూడుచుంట నఘకార్యవ్యగ్రుఁడీ బిడ్డ; సం
స్కృతి నీచేతిది; పుత్త్రిశిక్షణము నీకే చెల్లు; నీమేలె నే
నతిదీనంబుగ వేడుకొందును; ఏలాకా? తల్లి! జ్ఞానాకృతీ!

154

♦ ప్రోచుట నీదు వంతు; విసువుందలపోఁతల నొందకుండఁ జే
సాచుట నాదువంతు; నిజసంతతి దైన్యము నొందుచుంట నీ
మాచితి కెంత లోటొ; యరయన్ భవదాకృతియైన సృష్టిలో
నాఁచక తెల్పుదీపరమధర్మమె; దానిని గాచుకొమ్ము మా!

155

♦ పెట్టిన తెల్వి గొంచె, మొకవేళ నదే తలక్రిందు చేసి చే
పట్టిన దివ్వటించబలె విపత్కరమాటను గంచు, నీది గా
నట్టుల యూరకుండుటది న్యాయమె? బిడ్డకు వస్తువిచ్చి యె
ట్టెటులు వాడుటో తెలుపవే యవివేకికి? బుద్ధిరూపిణీ!

156

♦ ననుఁగన్నమ్మగ నిన్నె చాటుకొనుచున్, నాయాభిజాత్యోచిత
మ్ము నదీనమ్మగు సాధుమార్గమున నేఁబోవున్న లోకమ్ము న
న్ననదే నీచుగఁదల్లి! నీవె సకలాంతర్వ్యాప్తిగాఁ బల్కు ప్రా
మినుకుల్ సత్యముకావె? త్రిప్పుకొను నన్మేల్దారి, రాజేశ్వరీ!

157

♦ తలుపు ల్తాళము లొప్పునట్టివి, నవద్వారమ్ము లున్నట్టి, యీ
యిలు సూపించితి వుండుమంచు, జననీ! యే నెట్టివాఁడైనఁజో
రుల నడ్డంగలనా? ప్రధానమగు దారుల్ రెండు మూయించితే
ని లవమ్ము న్వెఱలేక, యుండె నిలుతు న్నీసేవలే చేయుచున్.

158

♦ నీడను బాతిపెట్టుమని నీకు విధించితి నన్నయట్లు, లీ
పాడు తలంపుల న్నెడపుపాటు విధించితి; సృష్టిచేసి కా
పాడుదు, లోనికిద్దు నను నాట తలంపుల కొల్వ కాదటే?
వీడదు నిన్నె; నన్నెటులు వీడు? ఉపాయము నీవె చెప్పవే.

159

♦ ఇంతటిదాఁకఁ జేసినది యెంతయు కాదు లవంబు; తల్లి కో
ల్వెంతయొ తక్కియున్నది; మఱెన్ని యుపాధుల నెట్టి విచ్చినన్
జింతిలనమ్మ! "మెచ్చితిని సేవలకు న్విడనాడ నిన్ను" న
న్నంతకుఁ బంతగింతు నధమాధమ పుత్త్రిడనాట, మొండినై.

160

♦ ఇంటిని వీడి పోఁడు, గ్రహియింత మటన్నను గానరాఁడు; ము
క్కంటి నొసంటి కంటి సెఱఁగాల్చిన నాఁడు దయార్ద్రదృష్టితోఁ
గంటివి తల్లి! ధ్యానికపకారముఁజేయునటంచు నెంచలే
కుంటివి; కామచోరగతికుంఠనముంబొనరింపు మిప్పుడేఁ.

161

♦ వనితల చేతి బొమ్మనయి, వాంఛల చేతులలోని బొమ్మనై
యెడయక యాడినట్టి మతిహీనుఁడటంచును వీడకమ్మ! ఆ
వెడవెడ యాటలందు నిను వీడని నాచరితమ్ము గంగలోఁ
బడు కసుమాలమై పరమపావితమే కదె; సర్వసాక్షిణీ!

162

♦ బెల్లము గల్గు చోటు కనిపెట్టఁగఁ జీమకుఁబెట్టెనంత జ్ఞా
నోల్లసనమ్మె పెట్టిన, పృథోద్యమినై పరతత్త్వసిద్ధికై
తల్లడ మొందువాఁడనటె? తల్లి! భవత్కృప యిప్పుడైన రా
జిల్లఁగఁజూచితేని నినుఁ జేరవటే పసిపట్టి? యీశ్వరీ!

163

♦ ఏడుపుతోనె పుట్టుటయు, నేడుపుతోడనె చచ్చుటన్న, నా
యేడుపె నమ్మదెల్ల నన నేమిటి కబ్రము? కన్నుమూసి నిక్క
జూడఁగ వచ్చు కన్దుల సోనలు కారెడి నాళ్లె, తోఁచ రా
వేడుపునాళ్లుగా; సుఖమయీ! యవె మా కనయమ్ము నీయవే.

164

♦ జగతిని నాదు పోకడలు చప్పఁగఁజర్వితచర్వణమ్ముగా
నగపడ నోర్చు నాబ్రతుకు నందము, గాబున మున్ను తోఁటమై
వెగటనిపింప, మళ్లి చొర బీతయి, నీదయపేరి ప్రొద్దుచేఁ
బొగయువమట్లు వే యుడఁగి పోవన కోరెద, భక్తతారిణీ!

165

♦ అనుకరణమ్మున న్వాలితియా ముదమందుచు, మింటఁజిల్లులం
బొనరుచు డాబుతోఁదిరుగు పుట్టువొసంగక, గోవుగానొ, భూ
జనిగనొ చేసి, నీతెలివొసంగియె యున్నఁబరార్థనిష్ఠతో
మని నినుఁజేరి, యీదెసకు మళ్లుదునే మఱి తల్లి! శాంభవీ!

166

♦ నెత్తుటి బొట్లతో సరిగ నిల్చిన పీమెయి నాదొసంగు; లు
వ్వెత్తుగ రెండిటింగలిపి యేర్చుచె మేలగు; వేఱు వేఱటం
చెత్తులు వేయుదేని, మెయి యెత్తుట మళ్లియుఁదప్పదంటె? యి
బత్తుఁడు నీపదాంబుజము పట్టుట యిందుకె కాదె? ముక్తిదా!

167

♦ మమకారమ్ము శరీరహేతువను నమ్మాన్యోక్తి నే నమ్మి, నా
మమకారాహమిక ల్దొలంప నిను సంప్రార్థింతునే; నట్టిచో
''మమ మాతా పరమేశ్వరీ సకలసంపద్దాయినీ''యన్న ని
త్యమమత్వమ్మెడలించినన్ మఱల మేతాల్పున్నదంటే కదా.

168

♦ చల్లని తల్లి! వేములను జాటుచు వెత్తిపడంగ నీకు; నా
యుల్లమెఱుంగుదీవు; భవదుద్ధురసత్కృప నేనెఱుంగుదున్;
మెల్లఁగ దిద్దగాఁదగును నేరములున్నను మొట్టి మొట్టి; నా
తల్లి మహేశ్వరేశ్వరి కదా యను ధైర్యము వీడనీకుమా.

169

♦ మృగధరు హానివృద్ధులకు, మేదిని నిల్చు సముద్రవారికిన్,
ఖగతిఁజెలంగు గాములకు, త్మోతలమందఁగు భూతరాజికిన్
జగతిని సస్యపాళికిని జక్కని లంకె బిగించు నీదు ప
న్నుగడలు సృష్టిరక్షణవినోదములే కదె; విశ్వసర్జనీ!

170

♦ జననీ! చిత్రవిచిత్రరూపమగు నీసర్గం బదెట్లైనదో
మనుజామర్త్యులు నెన్న లేరనుట ముమ్మా భ్రమా; దీనిఁ జే
రని యట్లుండియుఁ జేరి, నాయికవునై రాజిల్లు నీవేని, సృ
ష్టినిదానమ్మదో తెల్ప లేవా, యనుచుం జింతింతు; కామేశ్వరీ!

171

♦ పిడికెట మబ్బులం బిడిచి విశ్వముఁ దన్పుదు వానరూపునన్;
పడఁకులఁ దోల్చి తెచ్చెదవు వాఁగుల; నంతన నీటి తిట్టకున్
వడివడి దొడ్డి కాలనటు పంపుదు; విట్టులు గాసి యెంతయో
పడెదవు; నీదు పన్నుగడ పట్లఁ దమింగదె; లోకరక్షకీ!

172

♦ మున్నీ రెవ్వరు ద్రవ్వె? రాకడలి పెంపున్నింప నెవ్వార లే
ళ్ళన్నిర్మించిరి? వాని కేతముల నేలావర్లు నీ ర్వోటి? రీ
విన్నాణమ్ము దురూహ్య మోజనని! నీవే సృష్టిసంరక్షకై
పన్నంజాలితి, వేఱ శక్యమిది? విశ్వాధార! విశ్వేశ్వరీ!

173

కాలాదిద్రుహిణాండముల్ సకలము న్గల్గించి యందుండు ని
ద్దీలా గిచ్చటు నంచెఱుంగ నిను నేమింపంగ నెవ్వాఁడునుం
జాలండౌట నుమా! మహాయశమునన్ స్వాతంత్ర్యము న్నీవె యై
పోలన్నీకె యశఃస్వతంత్రపదముల్ పొల్పారె నామంబులై.

174

♦ నినుఁ బూజించిన నీదు లోకము, నిను న్గీర్తింప నీచేరువన్
నిన్ను సేవించెడి వారిఁ జేరి పలుకన్ నీసాటి రూపంబు, నీ
తనువే యీస్థిరజంగమంబనుచు నిర్ధ్యానింప నిన్జేరుటన్
గను నీభక్తుఁడు; వింత! యోజనని! ధన్యత్వమ్ము వేఱున్నదే?

175

♦ వాగస్త్రమ్మున దండకాటవిగఁ జల్పంజాలె నొక్కండు స
ద్యోగప్రాజ్యము రాజ్యముల్; సమరభూముక్త్రాసుయోధాళిఁదా
నేగాసిం గొనకుండ లేపె నొకఁ; డీయెత్తెన్న, భక్తుండు నీ
లోఁగొంటే కదె; నేఁడసాధ్యమగునా లోకేశి! నిన్గొల్చినన్?

176

♦ నిను స్వాధీనఁగఁజేసికొన్నపుడు సంజీవక్రియామారణా
స్త్రనికాయాత్మకవాక్స్వరూపిణివిగా రాణింతు; వాకందువన్
మనుజుండెన్నక నేఁడు పన్ను నొక సంహారాస్త్రమే; నేను మే
ననుచున్నంతకు నాతఁడిట్టి శ్రమకే యగ్గంబగున్, భైరవీ!

177

♦ హరి యిచ్ఛంగొని తానె పుట్టు ననుటమ్మా! నమ్మ; నెవ్వాఁడు ద
ర్భరశోకాకులగర్భగోళవసతి న్వాంఛించు? ఏ వెఱ్ఱి య
ప్పరకోలాదికనీచవేషములఁదాల్పంగోరు? నీ యాజ్ఞకుం
బరిబద్ధుండగు చేతనుండగుట సంప్రాప్తించె నవ్వేషముల్.

178

♦ నవనాథాగ్ర్యశరీర వీవు; పరమానందైకమూర్తిప్రధా
న; వనాధావనశీల వీవు; సతతాంతఃపూజనవ్యగ్రమా
నవనాథాకృతి వీవు; భక్తజనతానంత్యప్రదానాఢ్యవౌ
నవరాత్రార్చితదుర్గ వీవు; నవయజ్ఞప్రీత వీవచ్యుతా!

179

♦ ఇడుమలఁ బడ్డవాఁడు స్మరియించిన బీతెడలింతువమ్మ! స్వ
స్థుఁడు తలపోసినన్ బరమశోభనబుద్ధి నొసంగు; దెట్టి శే
వడినయినన్ దొలంపఁగల వారలిఁకెవ్వరు? మేలొనర్చుచో
నెడగన వెట్టివారయిన నెప్పుడునుం గరుణార్ద్రచిత్తవై.

180

♦ అమ్మా! భక్తులకెల్ల నీవె హృదయంబై యుండుటన్ వారి క
ర్మమ్మే నీసుఖమౌను; వారల యమర్షమ్మే త్వదీయాతిరౌ
ద్రమ్మౌ; వారి కృపావిశేషమె భవత్కారుణ్యమౌ; వారి వా
క్యమ్మే నీయుడివోని మాట యగు; భక్తాకార! రాజేశ్వరీ!

181

♦ హరి యొక్క పాలపాపఁడటు లబ్ధిని మఱ్ఱిదళంబుపైని, ప
త్సరసిజముం గరాబ్జమునఁదాల్చి, ముఖాంబుజమందుఁదార్చి, గుం
గురులిడఁజిచ్చకొట్టి చిఱుగుర్కలు గ్రమ్మఁగ జోల పాడి, యా
దరమునఁగాచినట్టి సుఖదాయిని, తాయిని నిన్నుఁగొల్చెదన్.

182

♦ జయదా! కష్టదినాలు సౌఖ్యదములౌ సద్వేళలౌచున్; బరా
జయభీతుల్ జయహేతులౌను; బలియౌ శత్రుండును న్మిత్రుఁడౌ;
ప్రయతాత్మ న్నినుఁగొల్చు భక్తులకు సంప్రాపింపరానట్టి వే
వి? యనంతమ్మగు శక్తిసంపుటము నీవే కన్క; రాజేశ్వరీ!

183

♦ నీవే యల్గినఁ జీమ బెబ్బులి యగున్; నీవల్గినం జిచ్చు నీ
ఱై వోవున్; జగదీశ! నీసెలవు లేకల్లాడ దాకైన; లో
కావస్థల్ సకలమ్ము నీముదలచే నట్లట్లు సాగున్ గదా;
దేవి! సర్వము శక్త్యధీనమన సందేహింతుమే? చండికా!

184

నిను మా భారతదేశజుల్ కొలిచి 'వందేమాతరం' మంత్రమున్
గొని యీ చిప్పస్వరాజ్యమే కొనిరి; మాకున్ గొప్ప స్వారాజ్యవి
మ్మన నీవే? యపవర్గరాజ్యమును దెమ్మన్నన్, సరే' రాజ్యదా
యిని' కాదన నేర్తువే జననీ! మాకీ మంత్రమే చాలదే?

185

♦ 'వందే మాతర'మన్న మంత్రజపమే ప్రారబ్ధమై, రాజకీ
యాందోళాహవమందు గెల్పిడినదై యానందము న్గూర్చె; నే
మందుండేనియుఁ గాదనంగలఁడె? శ్రీమాత్రంఘ్రిసంసేవచే
సందర్భ రానిది లేదటంచు మఱి సాక్ష్యమ్మేల? రాజ్యప్రదా!

186

♦ రామాంఘ్రిద్వయి సోకి కాననొక ఆ రామాకృతిం దాల్చె, వి
శ్వామిత్రుండు సురాళి దద్దఱఁ బ్రతిస్వర్గంబె కల్పించె; ఘో
రామర్షుండొక మౌని సాగరుల నీఱై పోవఁగాఁ దిట్టె; నీ
వే మాఱాఁగఁ దదాత్మగాఁ గలిగె నీవింతైన మాహాత్మ్యముల్.

187

♦ మొదలిట్టి జన్మలందెపుడుఁ బొందని నీ భజనమ్ము, లేమహా
త్మ్మ దయనో నేఁడు కల్గ మఱి పుట్టువు లేదను నాప్తవాక్యమం
దెదఁ గొంతుకేల? వత్సరము లెన్నిరొ చీఁకటినిండి యున్న యా
గదినొక దివ్వెతోఁ జనినఁ గ్రక్కునఁ జీఁకటి మాయదే? శివా!

188

♦ కామేశార్ధమవో, తదంకగతవో, కామేశ్వరాకారవో,
నీ మేనాము నీవె యిచ్చితివో, తానే సాము నీకిచ్చెనో?
నా మేమర్మమె తేల్చుకోఁదగని నేనా మానికంబెంచు, టీ
మా మాయావృతి వీడనంత కిదియే మా తెల్వితేఁటమ్మికా!

189

♦ కపటస్వాంతులు కాని యోగులు చిదాకాశమ్మునన్ స్వేచ్ఛమై
యుపనీతప్రతిబంధులై మెలఁగ, సర్వాత్మైక్యసంధానుభూ
తిపదంబందున నిల్పు దానవగుటన్ దేవాదిదేవేశి! నీ
యపవర్గప్రదసంజ్ఞ సార్థమగుఁ గాదా; రాజరాజేశ్వరీ!

190

♦ జననీ! ద్వంద్వసమూసమందు, శ్రుతిశీర్షావాక్యములన్, వద్దు మ్రొ
క్కున నగ్రస్థితి నీది; వంద్యపదభిక్షుండై ననుం దల్లికే
వినతు ల్సేయక తప్పః దీవిధము భావింపంగ బ్రాముఖ్యముల్
జననీసేవకె వేద మిచ్చెననఁగా సందేహమా? శ్రీమతీ!

191

♦ రవియుం జంద్రుఁడు పంచభూతములు క్షేత్రజ్ఞుండు, నిర్మాల్గు నీ
ధవు దేహమ్ములటన్న సర్వమును నాతండంటయే; నీవు నీ
ధవు మేన న్సగమన్న భిన్నమగు నర్థంబున్నదే? అష్టమూ
ర్తివిశేషమ్ములు నీవె కాఁదగదు కాదే? శంకరార్థాకృతీ!

192

♦ జనకుని ప్రేమ మేయమును శాసనదీప్తికఠోర; మమ్మ శా
సనమొ, యమేయవత్సలత జాలని మాధురితోడిదంచు, మా
కనుభవమాట నిన్ను విడ - మైనను దంద్రికఠోరవార్ధమే
ఘనమను వారలుంగలరు కాదె? యభిన్నత నెంచి శాంకరీ!

193

♦ ధనులై, రాజ్యరమాగృహీతకరులై, ధర్మజ్ఞులై, ప్రజ్ఞులై
యనుకంపామయులై, కవీశశశులై, యాశాసరత్కీర్తులై
తనుజానందవిహారులై, సుతనులై, దైవారు వారెల్లఁ ద్వ
న్మనుసిద్ధిం గనినట్టి వారలె కదా; మాతల్లి! కామేశ్వరీ!

194

♦ దినము న్నెట్టును రాత్రి; ఆదినమె రాత్రిన్నెట్టు; శుక్లమ్ము వెం
టనె కృష్ణమ్మను పక్షః ముత్తరము వెంటన్ వచ్చెడిన్ దక్షిణా
యన, మీనక్రమచర్య నీదనఁగ వింతా! కాలచక్రమ్ము నీ
తనువై యొప్పుటఁబూజ్య, వోసకలమాతా! నీవె కాలప్రథన్.

195

హరి శక్రాదిసమర్చితంబయిన విద్యారాజమే మాకు నా
దరువౌ బంగనఁబత్తుపాతరహితత్వంబేర్పడున్; దల్లికిన్
సరి కాదే సుతకోటి పట్లనగు వాత్సల్యంబునన్ దేలు; నీ
కరుణాదృష్టియు నీవలెన్ సతము గాఁగన్ జెల్లదే, తల్లిరో!

196

♦ అమృతము పేరె, కాని యెవరానిరి, చూచిరి లోకమందు? వే
దమహిజసత్ఫలమ్ములు సదా రసముట్టెడి నీదు పేళ్లు, సా
ర్థము లమృతాబ్ధిబిందువులు; తత్క్షణ మొక్కటి నోటఁబట్టు వా
రమరసుఖంబు తుచ్ఛమనరా? మనరా మఱి దాని కావునన్?

197

♦ హృద్యము ద్వంద్వకల్పనము, యేకము కాదని చెప్పి చూపనో
విద్య వవిద్య నీవ యయి వెల్గుచు మంచియుఁజెడ్డఁగూర్చి సృ
ష్ట్యుద్యమసిద్ధిఁగాంతు వవియో, నినునంటవు; నీకు నశ్రులన్
బాద్యమొసంగు భక్తులకు బాధ నొసంగవు; విశ్వసర్జనీ!

198

♦ లలనలఁదోల్త, వెన్కఁబతులన్, జత గూర్చి వృత్తులన్ ద్రిమూ
ర్తుల మిథునమ్ము లొప్పుటయుఁ దొయ్యలి బాసిన వార లర్హ పూ
జలకుఁదలంగి పోవుటయు, జాయలనే గృహలక్ష్ములంట, గాం
చ లలిత యగ్రసేవ్య శివశక్తి యనంగొతు కేల? పార్వతీ!

199

♦ మొదలున్నన్ దుది యుండు, నీకు మొదలే పూజ్యంబుగా నంత మె
య్యది? జ్ఞానాత్మకవౌచు సర్వమును నీవై నిల్చుటన్ శాశ్వతీ!
మొదలో? యంతమొ? ఆయనంతమువలెన్ బొల్పారుటన్ సార్థమై
కుదురన్ నిన్ను ననంత యంచు శ్రుతి పేర్కొఁగన్గె; విశ్వేశ్వరీ!

200

శివుఁడన నీవు; శక్త్యభిధఁ జెల్లుదు నీవ; అవిద్య నీవు; వి
ద్యవు; సమయాఖ్య నీవ; యది దాల్చిన దానవు; ఆత్మ నీవ; దీ
పవు, నణిమాదు లీవ; నినుఁగాదని వేఱొకఁడేది? సర్వమై
తివి; పరతత్త్వ మో భగవతీ! కనరాదిఁక మాకు వేఱుగా.

201

తరగల సద్దులేని బెడిదంపుఁబయోనిధిఁదూర, లగ్గి మి
ద్దురులును, బ్రొద్దునందుఁగళుకుల్వలె, నీమహదాదితత్త్వముల్
పొరిఁబొరిఁ బారతంత్ర్యమునఁబుట్టు నణంగును, సాత్త్వికాంశవి
స్ఫురణముతోడి నీయెడనె, పో, ప్రతికల్పమునందు, సుందరీ!

202

మందనిసంతఁజీదటిలి, మాను వ్రణ మ్మొకకోఁతతో ననన్
ముందె వణంకి, యావెనుక నోరిడి మందున, కావ్రణమ్ముఁగ
త్తిం దెగఁగోయ నోర్చికొనుఁ; దీవ్రరుజాహరశక్తి పేరి యా
నందరసాకృతిం దనరినంగదె నీవట; శక్తిరూపిణీ!

203

మాత! నినున్ 'సహస్రపరమా' యను మంత్రముతో నుతించు వాఁ
డాతఁడె మంత్రగర్భపరమార్థము నెన్నిన, సర్వమూల మీ
వైతి, వఖండవీర్యవు, త్వదాకృతి సర్వమటన్న బోధమై
కాతరుఁడౌనె? చెడ్డ కలఁగాంచిన దోసము వాని నంటునే?

204

రసమయి! నీయెడంబొడమె రమ్యబహుత్వవిలాస, మందుచే
నెసఁగె రసంబులెన్నొ; అవియింతియె? తొమ్మిదె యంట యొప్పె? యా
రసములడంగు నీదగు విరాడ్రసమైన ప్రశస్తశాన్తమున్
రసమున, నంచెఱుంగుటయె జ్ఞాన, మదే రసరూప మంబికా!

205

♦ నెల వెలుఁగట్లు వెల్గు జననీ! తనయాదులు బంధుకోటియున్
జెలులును భృత్యులున్ గృహము క్షేత్రము కాయముసొమ్ము లెప్డునన్
వలవక వీడునో, యపుడె పాయని మోహమయాంధకారమున్
దోలఁచి, కృపామయాత్మవయి తోడనె యండనె యుండు మీశ్వరీ!

206

'వరద'వనంగఁగోర్కుల నహారిగ నిత్తువటంచె కాక, నీ
వరుఁడుగ నెన్నఁగాఁబడిన బ్రహ్మముఁ జేర్తువటంట కాదటే?
అరయఁగ బ్రహ్మ సమ్మితవు నక్షరవంటయు, సంధ్యవంట, య
య్యరపది బ్రహ్మధర్మములు నారిన బ్రహ్మము వంటెకా? శివా!

207

అమ్మా! యాసురవీర్యపీడ మొదలై నప్డెంతయో స్వాంతర
జ్జన్మందూఁకును లోకనిందితగతి న్నాట్యమ్ము; తోడ్తో నపూ
ర్వమ్మా రీతిని దేవవీర్యమునకుం బ్రాబల్యమై, లోన ది
వ్యమ్మౌ శాంతరసమ్ము పాఱు; నవి నీ యాశ్చర్యలీలల్ గదా.

208

కను దెర యెత్తి దించుటకుఁగాలము యత్నము సుంతయైనఁద
ప్పనిదగుఁగాని, తల్లి! నినుఁబట్టుకొనం దడవుఱ్ఱ శ్రమంబు లే;
దనయము నంతట న్వెలయు నాత్మను నిన్నును గోరకుండు టే
మనుజుని తప్పిదమ్మనుచు మాటికిఁగుందెదవమ్మ! శాంభవీ!

209

జగ మానందమయమ్ము, తజ్జననసంస్థాసంస్థ లానందమం
దె గదా; యీఋషివాక్కె నేఁడుఁ బ్రతిశబ్దించుఱ్ఱ దిగంతమ్ములన్;
జగదంబా! యదె నీదు రూప, మది యజ్ఞశ్రేణికిన్ భిన్నభి
న్నగతిన్ దోఁచినఁదోఁచనిమ్మది యఖండమ్మే కదా, శాశ్వతీ!

210

'మనకెడ లేకె నిల్చి, మనమంగళసాధనసిద్ధికై విలం
బనము సహింపదమ్మ' యను మాటను నమ్మి 'మహేశి! తెల్వికె
న్నెనరున విప్పుమమ్మ!' యని నిష్కపటమ్ముగ నేడ్చు వారి సా
ధనధనసిద్ధిఁజేత నిడి దగ్గరఁజేర్చెదు కాదె యంబికా!

211

ముమ్ముళ్ళన్ విడనంతకాలమును, జీవుండీ జనిధ్వంసక
ష్టమ్ముం దప్పఁగొనంగ లేఁడు; జననీసందర్శనమ్మే యుపా
యమ్మౌ నయ్యది మాతృపాదయుగమం దాత్మార్పణమ్మైనచో
నమ్మూటిన్ విడఁగొట్టు దమ్మవు మమత్వాకృష్టవై, శాంభవీ!

212

జనని! తలంప దుర్గభవసాగరతారణనౌక వీవు; దా
ని నడుపు కర్ణధారుఁడవు నీవె; యసంగవు దేవి! మేధయా
పున మను నిన్ను నింతయిన ముట్టునె నిత్యను శుద్ధబుద్ధము
క్తను బహుభావతీవ? మటుగాన నసంగవు; శ్రీశివాంగనా!

213

గురురూపమ్మున జీవహృద్గుహల సంకోచింపకే నిల్చి, దు
స్తరమానజ్ఞతఁ బాఱఁదోలుట యథార్థమ్మైన నీ యీజగ
త్పరిరక్షావిధి; నీది కాదటె జగత్సర్గాదికం? బందుచేఁ
బరిపాలించుటయుం భవత్కృతిగ సంభావింపవా? శాంభవీ!

214

పలుతెఱఁగుల్ సినీమ తెఱపైఁబడు బొమ్మలు, దాని నంటునే?
జ్వలనము కన్పడున్, నదులు పాఱును దానిని గాల్చి నాన్చునే?
చలనము లేక యే సకలసత్త్వగ నిల్చిన నీవు నట్టులే
యలరుదు వమ్మ! చిత్రము నిరంజనవై జనరంజనక్రియన్.

215

ఆటకు మున్నె యుండి, యట నాడెడి పాత్రలపైనె గాక, యా
యాటనుఁజూచు వారిపయి, నాట ముగించినపైని నెల్గు, నా
నాటకశాల దివ్వెటు వినాశము లేనటు, నీవు నీజగ
న్నాటక సాక్షిణీత్వమున నాటకము న్నడిపింతు వీశ్వరీ!

216

భగవతి! నీద్యుతిన్ రవలె భాస్కరశశ్యనలాదులున్; పరం
బగు నల బ్రహ్మమింత నలుసౌను భవత్సుఖమందు; ఈశివా
దిగ భువిదాఁక నిమ్మకొను దేవిరో! త్ర్యండశరీరవైన నీ
దగు నుదరమ్మునం దయిన నాశ్రితులోఁగనవత్తు వింతయా.

217

అమ్మ! ప్రధానవం చొకటి, నాత్మ వటంచును నొక్క, రీప్రపం
చమ్మని యొక్క, రల్ల సదసత్తులు రెండు నటంచు నొక్క, రీ
యిమ్మనఁబల్క, వేఱొక రవేవియుఁగాదని యందు; రిట్టిభే
దమ్ములు సూడ నీవిలసితమ్ములు నీదగు మాయనే కదా!

218

శివుఁడన నీవు; శక్తి యనఁజెల్లుదు వీవ; అవిద్య వీవు; వి
ద్యవు, సమయాఖ్యవీవు; అదితాల్చిన దానవు; ఆత్మ వీవు; దీ
క్షవు, నణిమాదులీవు; నినుఁగాదని వేఱొకఁడేది? సర్వమై
తివి పరతత్త్వమో భగవతీ! కనరాదిఁక మాకు వేఱుఁగా.

219

మానిసి పుఱ్ఱెపేరు మెడ, మధ్యమునన్ నరదోఃస్రజంబునున్
జానుఁగులన్ శవమ్ములను జానగు సొమ్ములు చేసి కాఁటిలో
నే నడయాడు, మమ్మ! శ్రుతినిశ్చితతావకవైభవ మ్మనే
కాననులైన నిట్టి దన నర్హులకే? జగదీశి! కాళికా!

220

నిను నిగమాంతముల్ భువననేత్రి! మహామహిమాఢ్య యంచుఁ గీ
ర్తన మొనరించుఁ; విప్రులు స్వధర్మరతుల్ క్రతుభోక్త్రి యంచు, నిన్
దనుపుదు రాసలన్ విడిచి, ద్రష్ట్రిగ నిన్గని యోగులీ యహ
మ్మను ముడి విప్పి, నిన్నె యనయమ్ముఁ దలంతురు కాదె; యీశ్వరీ!

221

ఆసురదైవభావముల యాకృతి యేరిది? నీదె కాక; అ
య్యాసురదైవవీర్యముల యాకృతి యేరిది? నీద; యెప్పుడ
య్యాసురవీర్యవృద్ధి యగు, నప్పుడె జీవులయందు సత్కృపా
భాసురచండరూపమున వాలి క్షయంబొనరింతు, చండికా!

222

ఏయెడ సర్వవీర్యవినిహింసనమౌ, నది యొండు వీర్యమౌ;
నాయదె శ్రేష్ఠమైన యభయామృతవీర్యము; దాని కల్కియే
వాయుముఖుల్ క్రమంబఱక వ్యాపృతులౌటయు, మృత్యువోడుటౌ;
నాయసమానవీర్యమయి వమ్మవు; నీకివె కోటి జోతముల్.

223

అమ్మా! సౌరజగత్తు లెన్నియొ చిరమ్మై వేగ, నేదో యల
త్యమ్మా కేంద్రము వంక కేగు; నరయంగా నామహాశూన్య మ
న్యమ్మా? దేని యురమ్మున న్నిలిచి బ్రహ్మాండాళి రాణించు, న
న్యమ్మా యయ్యది నీవు తక్కఁగ? నచింత్యప్రాభవత్వాంచితా!

224

మును వెన్నెల్, వెలిలోనులున్, గొలఁదియున్నోలంబుఁ, దోలెమ్ము లా
వును, గుంపు న్విడి, దాపునన్ బయలు, దవ్వుం జేర్వయు న్నెలుఁగీ
ళ్లను నీవిశ్వము నీవె తాల్చెదవు పశ్యంత్యాఖ్య సార్థమ్ముగా
ననయమ్మున్ మఱి యీజగమ్ములను సల్లాడింతు వీవే, శివా!

225

జననమె యిమ్మ, మోక్షమె యొసంగుము, తత్పరశర్మదేహావున
గనఁగఁ బ్రపంచరూపవును, జ్ఞాననిసర్గవు, రూపహీనవున్
వినతకృపానిధానమవు, విశ్వజనిత్రివి, ధామసీమవౌ
నిను భజియింపనిమ్ము నను, నీదగు చిత్తమె నాదు భాగ్యమా.

226

అతులితబుద్ధియోగధన మబ్బినవారికి సౌమ్యవీవు; సౌ
మ్యతరవు ప్రాణదర్శులకున్; అమ్మ! మనోవిలయంబొనర్చు పు
ణ్యాతముల కీవు సౌమ్యతమ; వట్టి మహాత్ముల నెన్నఁడైన జా
గతికవిశిషసుందరత కన్మొఱఁగించునె? కామసుందరీ!

227

ప్రకృతివి నీవె, బీజముగ భాసిలుచున్ ఫలరూపమందుచున్
సకలమునందు నెన్నొ పరిణామములం గలిగింతు వంచుఁదోఁ
పక, నినుఁబతీపాతినిగఁ బల్కెడి మూఢుల కాత్మతత్త్వమున్
బ్రకృతివిలాసముం దెలుపు బాధ్యత నీదె కదా? మహేశ్వరీ!

228

'విడుపును, గాపు, లోఁగొనుట, వీడని నాసుఖలీల, లూరకే
యడలెదవేల, భ్రాన్తిపడి యట్టుతకట్టని? నాయనా! శ్రమం
పడి శ్రమపెట్టెదేల? నిను బద్ధునిఁగాఁదలపోయుదేని, నా
దొడి కెడమే సుమా'యని, సుతోన్నతినే తలపింపు మంబికా!

229

జ్ఞానంబుం బరిపూర్ణసంపదయు, రాగత్యాగముం ధైర్యముం
నానాలోకపరీతకీర్తియు, లసన్మాహాత్మ్య మీ షట్క మీ
శా! నీవాటను నీవె సూ భగవతీసంజ్ఞార్హ వోయప్రదపు
త్రీ! నా వందనముల్ కృపంగొనుము; శ్రీదేవి! కలామాలినీ!

230

అమలస్వాంతమునం దనన్యమతి నిన్ ధ్యానించి మోదించు ని
ర్మమయోగీంద్రు మదీయుఁడంచతని కర్మఖ్యాతపాశంబు ము
క్తముఁగావించి శివైక్యమిచ్చుటను సార్థక్యమ్ముతో నీకు హృ
ద్యముగాఁ బాశవిమోచనీపదము యుక్తమ్మయ్యె; రాజేశ్వరీ!

231

జలవియదుర్వరాచరము జంతుసమూహము నెన్న నెన్నికో
టులగు విభేదములనఁబడున్, దదవాంతరభేదమెంతో? నీ
లలితవిసర్గచాతురి చలన్మతులన్ మముఁ జేయుచున్న, ని
శ్చలతమవస్తుతత్త్వమున సాగుట సాగదు, చిత్రకారిణీ!

232

♦ సతికయి యేడు, పాపయిని సంతతికేడుపు, దానిఁ బెంప నీ
వ్యోతకఁగ నేడు, పెట్టటులో పెంచిన లోఁగక ధిక్కరించు నా
సుతులకు నేడు, నీవిధము చూడఁగ సంతత మేడ్పుతోడిదౌ
బ్రతుకున రోఁత పుట్టుటకుఁ బన్నిన పన్నిక కాదె? శ్రీగురూ!

233

♦ నీవే పుట్టుచు నీవె పెర్గుచును నీవే యొబ్బిడిం జెందుచు
న్నావు, నీ నిన్ను వినాగ వేఱొకటి లే, దీమూడు వేసమ్ము లీ
వేవైనమ్మున వేయుచుందు వనఁగా నేమందు, నాయమ్మ! లీ
లావైచిత్ర్యమటంచు నామనసునే లాలింతు; కామేశ్వరీ!

234

♦ పవలయి జీవుల న్దమకు వాపి మెలంకువ నిల్పి, రాత్రివై
పవటి శ్రమంబడంచి సుకపర్చుచు నుందువు జీవకోటికి; సృ
ష్ట్యవనము చేయ నీపడయునట్టి వికారము లేదు; కన్కఁబ్రా
జ్ఞవరులు నిన్ భజించెదరు సందెలు నీవని; కాలరూపిణీ!

235

♦ చక్కని చంద్రుఁడన్న, నిది చక్కని చుక్క యటన్న, నేదియేఁ
జక్కనిదన్న, నీకొసరుఁ జక్కఁదనంబు రవంత యందులోఁ
జొక్కణమాటనే త్రిపురసుందరి! చక్కనిదాను; లేనిచో
నెక్కడిదమ్మ! యంతట రహించెడి దెన్నఁగ నీదు చొక్కమే.

236

♦ కనులకు మబ్బు మాపుచు, జగమ్మునఁ జుక్కఁదనమ్ముఁ గూర్చు, చె
ఱ్ఱని నును గోఁక కుచ్చిళుల రంగును నింపుచు, నేలవేల్పు లి
చ్చిన తడికాన్కలంది లలిఁ జిల్కుచుఁ గోరిన వెల్ల నిచ్చుచున్
బెనిమిటి ప్రొద్దు రాకఁగను వేఁకువ రాణివి నీవె; అమ్మికా!

237

♦ అల మూర్తిత్రయ, మాదితేయులుఁ ద్వదీయద్వారదూతల్గదా;
చలివెల్గు న్బగలింటివెల్గును భవచ్ఛందాజ్ఞఁ బాలించు దా
సులు కారా? మఱి భూతపంచకపుటూసుల్ సెప్పఁగా నేల? నీ
కొలువుం జేయని వార లేరు? సుమనఃకోదండినీ! చండికా!

238

♦ గుణముల సంగతిం దొలఁగి గొప్ప తలిర్చెడి నీవె విద్యవై,
గుణముల సంగతిన్మలఁగి గొప్ప తలిర్చెడి నీ వవిద్యవై
గణుతిని గాంతు; వీ యిరు తెగల్ హరిముఖ్యుల కందరావు; నీ
వణువునకంటెఁ జిన్నవు, మహాత్తునకంటె మహత్త; వంబికా!

239

♦ అలలుబ్బంగ సముద్రమై, యలలు మాయన్ గాక యున్నే? పనిన్
దలపెట్టం జలియింపఁగా, సగుణమున్ వ్యక్తం బటంచున్ బనిన్
వలపే వీడిన వేళ నిర్గుణము నవ్యక్తం బటంచు న్నినున్
బలుకున్ లోకము; శక్తి శక్తియె కదా, నా తల్లి! చిద్రూపిణీ!

240

♦ ప్రళయము వేళ నిజగతిం గ్రమ్మి రసాత్మకనారమే మహా
జలధిగ మాఱఁగా శిశువు చాడ్పున నందున మఱ్ఱియాకుపై
జలరుహనేత్రుఁ డత్తమిల, జాణతనమ్మున మీఱె, యమ్మహా
జలధికిఁ బాత్రభూతమగు శక్తినిఁ గొల్తు జగజ్జనిత్రి! నిశా.

241

♦ అమ్మా! నీవె గుణాఢ్యవౌచును 'బహుస్యా' మ్మంచు నీదృశ్యరూ
పమ్మందాల్పఁగ స్వాంగపూరుషునిఁగా భావించి రూపించి స్తో
త్రమ్మం జేసిరి; దానినే పురుషసూక్తంబంచు ఘోషించె వే
దమ్ముల్; తల్లియుఁదండ్రి నాఁదగు పదార్థమ్మీవె కాదా? శివా!

242

♦ శ్రీసూక్తమ్మనఁ బద్మషట్కగతి నిన్సేవించుచో యోగికా
భ్యాసమ్మందగు స్వానుభూతియు, నవాప్యంబౌ ఫలవ్యక్తివి
న్యాసంబంచు నెఱుంగ లేక, యిహభోగ్యశ్రీదమాత్రంబుగా
నూసుల్ చెప్పెదు, రట్టి దుర్దినము లయ్యో! మాఱునా? పద్మినీ!

243

♦ ప్రతిఘటనమ్ముఁ జేసెడి స్వభావము నాత్మబలమ్ముగాఁగఁ, బూ
ర్ణతఁగను దానిఁగాఁ, గుటిలరౌద్రము శాంతము గాఁగ మార్చి, మై
క్యతకును ప్రోత్సహించు నినుఁగార్యవిదుల్, పరశక్తిపూజనో
ద్యతులయి భక్తిఁగొల్చెదరు దక్షిణకాళి యటంచు నంబికా!

244

♦ సయిపఁగ లేవు నీ వసురసంపద; ద్రోహ మసత్యమున్నచో
దయ విడి తత్ఫలంబిడుదు; దాయలఁ జెండుదు; వాగ్రహమ్ముఁ బ్రే
మయు నతితీవ్రముల్ కుజనమాన్యుల పట్ల; నుపాసకారిసం
ఛయమును ద్రుంతు శీఘ్రతరచారిణివై, పరకాళివై; ఉమా!

245

♦ జ్ఞానికి నెందును న్వ్యాజయశక్తి నొసంగుదు; పూర్ణతాప్తికై
ధ్యానము చేయు సాధకుల నాదృతిఁ బ్రోతువు; శీఘ్రసిద్ధితో
దీనులఁగావ సంతతము దివ్యకరమ్ములు సాఁచి యుంతు, వ
ద్దానివి నిన్నుఁబండితులు దక్షిణకాళిక యందు, రంబికా!

246

♦ స్మృతివయి నీదు బిడ్డలకు మేలెటు చేయుదు, వల్లె నీవె వి
స్మృతివయి మేలొనర్తు; వది చిన్నదె? జీవున-కీదురంతసం
సృతివిపినమ్మున న్బడెడి చింతలు సంతత మంటి యాతఁడు
స్మృతిఁగనునే? త్వదీయచరణమ్ములఁ జేరునె, తల్లి! యెన్నఁడేఁ.

247

♦ ఎల్లజగాల తల్లివి; మహేశ్వరి! నీవొక తల్లి లేని మా
తల్లివి; తోడ్కొనుల్లనని తల్లివి; తల్లుల కడ్పునందు బం
పిల్లెడి పిల్ల కోగిరము పెట్టెడి తల్లివి; నిన్నుఁగొల్చు రం
జిల్లెడి వారి నీయెడికిఁ జేర్చెడి తల్లివి; పల్కఁగల్లలేఁ.

248

♦ నీ పదునేను సత్కళలు నిండిన చంద్రుఁడు నీస్వరూపమై
యేపు వహించి సస్యముల నేఁదుటచేతనె తత్కృతజ్ఞతేఁ
గాపు శరత్తుపూర్ణిమను గారమవందుగఁ గ్రొత్తపంట నీ
కే పరభక్తి నిచ్చు, నదియే నవయజ్ఞము శాస్త్రమం, దుమా!

249

♦ దైవతమెల్ల దుఃఖపరిదగ్ధము, దానికి నెల్లకోర్కులుఁ
లేవె? శరీరధారణము లేదె? యొకప్పుడు మర్త్యయోనికిఁ
బోవక తప్పునే? విబుధపూజ్యను నిన్గొలువంగ మాని, మా
కావయివేల? నిర్గుణపరాంబను నిన్నె భజింతు; మంబికా!

250

♦ నాలో యోజన, నాక్రియ ల్చలనముల్, నాశక్తియుఙ్ సర్వముఙ్
నీలోనుండియె వచ్చునందు, రదియే నిక్కమ్మగుఙ్; నేనొ, ద
వ్వేలా? కాదది, యీసమస్తమును నీవే యందు; అట్లన్న నాఁ
డేలే; నున్నది యొక్క నీవె యనుటే, యీశాని! నిక్కమ్మగుఙ్.

251

♦ అరయఁగ సత్పదంబు పురుషార్థకమౌను; సతీపదంబు స్త్రీ
పరమగు; నిట్లు రెండిటికి వాసి పొసంగదు; సత్పదార్థమై
వరలెడి శక్తి యొక్కటియె, ద్వైతవిదూరము; దాని మాతృభా
వరతిని గొల్తు మమ్మ! సుతవత్సలతాభర మమ్మదే కదా.

252

♦ పరులకు విద్దెయో ధనమొ పండో మరేదో యొసంగు నప్పుడే
పరులకు నాకు సంతస మపారము గాఁగని, తుష్టిరూపమై
పరఁగెడి యొక్క వస్తువెదో పాయక యన్నిటఁ జెన్ను మీఱు; న
ప్పరతరవస్తు వీవె యను పట్టున సందియమేమి? శర్మదా!

253

♦ మాసిన గాజుకుప్పియను-మాసిన యట్లగు దివ్వె; కుప్పి ధూ
మ్యాసహితమ్ము గానియెడ నచ్చరుచి న్గనుపట్టు; అట్టులే
యాసురసంపదంధుల హృదంతరమందున వెల్గకుండు, వా
దోసము లేని చిత్తములఁ దొంగలికొందువు విద్యవై; శివా!

254

♦ జ్ఞానము సత్యముఙ్ సమరసత్వముఁ బూర్ణత నీదు మూర్తులై
వానినె సృష్టిలోని పరభావములై వెలయింపఁ జేయు, ది
మ్మానవవేషమందు అణిమాముఖభూతులు గాఁదనర్తు; వీ
వీ నలుశక్తులే చను మహేశ్వరి, కాళిక, లక్ష్మి, వాణివై.

255

♦ ప్రకృతి యనంగ నీవు బహిరంగము సేయు క్రియాస్వరూప; మా
సకలము నీదు నిర్ణయవిచారవశంబగు; అందు నీరహ
స్యకళ పరాక్రమించు; ఇటులన్ని జగమ్ములు నీదు క్రీడలై
ప్రకటము లౌనటన్న విసువాసమె సారము; విశ్వకారిణీ!

256

♦ తెలియఁగఁగోరు సాధకులు, తెల్లము చేయఁగఁగోరు తద్విదుల్
పలుగతుల న్నిను న్వ్యయలు పెట్టఁగఁ జేసెడి వాదమందు న
ప్పలుకులు నీవ యౌచు నికపల్లై మిగుల్చుచు, నీవు నీవయై
పలుకుల కందరాక, నిజభక్తుల కే కనుపింతు, విశ్వరీ!

257

♦ అగు నర్థమ్ము కిలాసమన్నఁ దెలుపం; చా తెల్పె సత్త్వమ్ము, స
త్త్వగుణమ్మె రజతమ్ము; తత్ప్రచురమూర్ధమ్మె శివావాసరౌ
ప్యగిరీంద్రమ్మని, యందు నీకుఁ బతితో సావాసమం చార్యులె
న్నఁగఁ గైలాసము వేఱుగాఁగలదె? యానందాకృతీ! పార్వతీ!

258

♦ 'అ'యనఁగ మాతృకార్ణనిచయాకృతి; దానిని మించు దానవై,
'అ'యనఁగ వాక్కునర్థము నటందు; రజే తనువైన దానవై,
'అ'యనఁబ్రకాశరూపశివుఁ; డాతని తత్త్వముఁ గ్రక్కు దానవై
నియతిగ'అంబ'యన్న నుడి నీకె గడించితివో; సరస్వతీ!

259

♦ కనఁబడుచున్న విశ్వమది కల్ల యెటౌ నుమ! పేరురూపులం
గనునది పేరురూపులను గానక పోవుట నెంచి, రూపు పో
యినను దదర్థబోధక మదేదొ నశింపదు గాన, నిత్యముం
గనుఁగొన వాక్కునర్థమునుఁగా మదిఁదోఁచును, నీవవే కదా!

260

♦ క్షీరసముద్రజాత రమ, శీతనగాత్మజ గౌరి నా, సహ
స్రారమునందుఁ దోఁచు భవదాకృతులే; అటనైన క్షీరనీ
హారములన్న నీదు చరణామృతమే కదె; శైత్యమాధురీ
సారరసాంచితౌషధ మసారభవామయదారకం, బుమా!

261

♦ సకలము నేలమట్టముగఁ జల్పు తుఫానులుఁ, గాన బూది సే
యు కడిఁది కారుచిచ్చులును, నూళుల ముంచెడి వెల్లువల్, మసు
రిక మొదలా మహారుజలు రేగుటయుఁ శివశక్తి! త్వత్కృపా
ర్జకపటుభక్తి దేశమున జాఱుటచేఁగదె, సర్వరక్షకీ!

262

♦ లలితా! నిర్గుణుఁడౌ శివుండు నిజలీలాశక్తివై యొప్పి, అం
పిలు నీయందు నసంఖ్యమౌచుఁ బ్రతిబింబింపంగ నౌ నంచునీ
డలయం దొండగు నావపుఃస్మృతియె బాలాదేవివౌ నీవుగాఁ
దలఁతుర్; దప్పదివైన నీవెటులు దిద్దంజూతువో, యంబికా!

263

♦ రాయిడి పెట్టు భక్తునిఁ దిరస్కృతుఁ జేయుట యెన్న, నంతలోఁ
జేయిడి యుద్ధరించుటకె; చేయఁదలంచిన దాన మార్పులన్
జేయవు; నీదు శాసనమె చెల్లఁగఁ జూతువు; తల్లి! ఓజగ
ద్గేయచరిత్ర! నీకరుణదృష్టికె దీనతతోడ వేచెదన్.

264

♦ నినుఁగనువారు చుట్టములు, నీపరతత్త్వముఁ దెల్పువారు నా
జనకులు, నిన్గనంగడఁగు సామయులే చెలు, లమ్మ! సత్యమే
మని దరిఁజేరు వారలె ప్రియాత్మజులై, తగు పెద్దగేస్తుగా
మనుపుము తల్లి! నన్ శతసమంబులు హాయిగఁ జిత్స్వరూపిణీ!

265

♦ పలుమఱు నీమహత్త్వంబారపాటుననో, మది పట్ట లేకయో,
పలుకుచు నుగ్గడింపఁ, బెదగోపన పెట్టెగ నెంచి, నన్నిషా
ఝన్నలకయి చేరు సజ్జనుల రోయక, నాచన వెంచి, నన్నుపెక్
బలుకృపఁదన్వి గూర్చి నిజభక్తుల పద్దునఁ జేర్పుమా, ఉమా!

266

♦ నీ యిడినట్టి వాక్పటిమ నిచ్చలు నీమహిమంబుఁ దెల్ప నేఁ
జేయు ప్రయత్నమై యడరఁ జేయుము; కానల నెమ్మియాటగాఁ
జేయకు మమ్మ! లోకులకు శ్రీయన నేమియొ, విద్య యన్న నే
మో, యెఱింగించు వైనమయి యొప్పునటుల్ కృపఁ జూడు, భారతీ!

267

♦ నిలువఁగ నిమ్ము మేను; మఱి నిన్న యనుక్షణమందుఁ గంటినీ
రొలుకఁగఁ గాంచనిమ్ము; ముద మొందుచు నీ పరతత్త్వగాథలే
పలుకఁగ నిమ్ము నన్దరియు వారికి; మోక్షమటన్న నెట్టిదో
తెలుపుదు కానిలే, మనకుఁ దేడయె తేలిన నాఁడు, శాంభవీ!

268

వను మునుఁ జెట్టుఁగా శిలఁగ నల్చి, క్రమమ్ముగఁ బేడపుర్వుగా
నొనరిచి, నొచ్చి, మొఱ్ఱ విని, యుద్ధవిడిక్ గృపతోడ మానవుఁ
బొనరిచి, బొట్టుబొట్టులుగఁ బ్రోఁగగు తెల్విని నిల్పితమ్మ! యీ
జననము దాని పట్టునన సార్థమొనర్చుట యేరి వంతగున్?

269

కలదొక తెల్వి సందర మఖండము, దాన జనించు లెక్క లే
నలలనుఁ బట్టుకొంటె పనియై యయిదింద్రియముల్ చెలంగు; నీ
తెలివిడియే గురుండు శివదేవుఁడు; వాని ముఖమ్ములైదు నీ
తెలివినె తెల్పునంచు నొక తేప వచించితి పిచ్చె, శాంభవీ!

270

ధవుతో సాటిగ నీకు ముక్కనులనన్, త్రైకాలికజ్ఞానరూ
పవు నీవంటురె; మాకు సుంతయిన నాభాగ్యమ్ము లేకున్నఁగా
కవికిన్ బల్లికి భావిసూచనగుణఖ్యాతింబ్రసాదించి, మా
నవలాభమ్మునకే లగించితివి, సన్తానప్రియా! శాంభవీ!

271

కనఁగా సాధకుఁడన్నఁడొందు సహజాఘాతమ్ముఁదాఁజేయు సా
ధనమందప్పుడె, యాత్మశక్తికిఁబ్రబోధమ్మా; నదే నీవు సా
ధనయుద్ధావని దూఁకి, యాసురగణోద్వాసక్రియన్ మాకు గ్ర
మ్మనఁదోడౌట; యదే దయాళుత; యదే మాతృత్వ మోచండికా

272

"ఏకాన్తాశ్రయమంచు నెంచి ననునే, యీ నా మహాప్రాణమం
దే కొంకున్విడి నీదు ప్రాణమును బొందింపం, గడున్ వ్యాకులం
బై కానంబడె నీమనస్సిపుడు, నా యంశమ్మునన్ జేర్చికో
నీకట్లన్నియుఁద్రెంతు"నంటివిఁక నే నిర్భీకుఁడన్ శాంభవీ!

273

తనయుల మంచిచెడ్డలను దల్పవు; నీవయిపే సతమ్ము మా
కనుకలు లుండుటే కనెదు; కావుననే మహిషున్ నిశుంభు
శుంభుని మధువున్ హిరణ్యకశిపున్ వధియించుట పేర, స్వాంకమం
దునఁగరుణించి చోటిడితి; తోఁచదు నీకృపకెల్ల; చండికా!

274

అమ్మరో! ఆత్మ-శక్తి-యను నాపదయుగ్మముతో సమాసభే
దమ్ముల నెన్నొ రేఁగెను వితండకుతర్కము; లివ్వి నీవు దూ
రమ్మునకొన్న యంతకును స్రగ్గ; వదెప్పుడొ చూపు నీపయిన్
గ్రమ్మిననాఁడె రెండును నొకండని తెల్పుదు వీవె సత్యమున్.

275

అమ్మా! నీ సేవనిఁ జేసుకొంటనెడి యాత్మావాప్తి యావాని వా
క్యమ్ముల్ తీయనతోఁచ నిందు; నిఁకఁదత్కంఠస్వరంబెంతో సా
ధర్మ్మై తోఁచును; వాఁడు తిట్టినను ఖేదమ్మింతయుంగాక, మో
దమ్మేయౌ; నిటు లాటకుంగతము బోధంబెట్టు మీవే శివా!

276

ఎవనిని సజ్జనుం జలుప నెంతువొ, యాతనియందుఁ బైఁడి కొం
డవలె నచంచలమ్మును దిటమ్మగు శ్రద్ధగ నిల్పి, నీవన
చ్ఛ్యవనునిఁ జేసి, సత్కృప ననత్పరపారముఁ జేర్చి, వానిఁ బ్రో
తువదె కదా, మదంబ! సరి తోఁపని మాతృత; భక్తపాలినీ!

277

"విడదు ప్రవృత్తి పూర్తిగ; నివృత్తి వికాసము కల్గ, దెన్ని మో
గాడవల కోర్చి. కన్నడుల కుంచము లీభవదంఘ్రిపూజకై
యిడిన"నటంచు నేడ్చుసపు డీవె సమత్వమునందుఁ గాలివై
యడరి గ్రసింతు వన్నియుఁ; రవంతయు దుఃఖము లేదు చండికా!

278

భవదవలోకసత్కృపలె భావవిశుద్ధికరౌషధంబులై
భవదవహ్నిశౌమకసువర్ణములై, యఘమర్షణమ్ములై
భవదవనేక్షణప్రసరభాగ్యనిదానములై, హిమాద్రిసం
భవదవదాహపానకము భాతి సుతృప్తిదముల్ భవాంగనా!

279

నే నాయమ్మకు ముద్దుబిడ్డ నను వానిన్, మెల్లఁగొన్నాళ్ళకున్
నే నీవాఁడననంగఁ జేయుదువు; వానిన్ మళ్లి కొన్నాళ్లకీ
వే నేనంచును బల్కఁ జేయుదువు; నీ యీ జీవకారుణ్యబో
ధానందమ్మె భవాని! సాధనఫలంబై బ్రోచు నీబిడ్డలన్.

280

కర్ణాకర్ణిగ వింటి, శాస్త్రములలోఁ గంటిన్ జనుశ్చక్రికో
దీర్ణాయాసముఁ దీర్తు వీవె యని; నీవే యింతలో నాదు న
భ్యర్ణమ్మందున లక్ష్మిదత్తగురునాఖ్యన్వచ్చి, చేఁబట్టి యు
త్తీర్ణుం జేసితి; నీదు ప్రేమమున కేదీ హద్దు? రాజేశ్వరీ!

281

అనయము ధర్మదేవతవయై, తలఁపించిన చొప్పుఁ బూను వే
ళ, నెది యెట్లైననున్ సరియె, లగ్గని, యప్పుడు మళ్ళి నీవె చూ
పిన గతి నేగు వాని నవివేకు లొకొందుగ నెంచికొన్ననున్
వెనుకకు మళ్ళనట్టి సువివేకులఁ గాతువు నీవె, చండికా!

282

ఇదె నా యెక్కటి ప్రేమకేంద్రమని, నేనెద్దాని నీక్షించుచుం
దుఁ, దదీయాంతర మంధకారమయమై లోఁపన్, మమత్వమ్ము
రి దురంతాసురభావముం గెడపి, యీరీతిన్ దగుల్ద్రెంప, నీ
వె దయన్ జేసితివంచు నెంచెదను; సర్వేశీ! శ్రితానందదా!

283

ఈవే తక్క నితఃపరాశ్రయము నాకేదంచు నిన్ గొల్చు స
ద్భావున్, 'ప్రాణము నెప్డు నాదగు మహాప్రాణమ్ములోఁ జేర్పను
న్నావో బిడ్డఁడ! చూడు నీసకలబంధమ్ముల్ తెగంజూతు'నం
చీవే యెత్తు దభీతిహస్తమును దేవీ! చండముండార్దినీ!

284

అమృతమహాబ్ధి యున్నదదె, యంతికమందునఁ గోరినంత స్నా
నమగును, శాంతిగల్గు నయినన్ బహుళోద్భవకర్మబీజమో
హము లటు వెన్క కీడ్చుతతి, నయ్యెడ దేహస్పృహికసంఘవై
రము సయితమ్ము భక్తపరిరక్షణకే కలిగింతు, వంబికా!

285

మఱి నిన్నుంగను నాస రేఁగునపు డమ్మా! యన్నచో నిశ్చిత
స్మృతిరూపమ్మున వచ్చి, తెల్పి మన నిర్భేదస్థితిన్ "నాయొడిన్
సతమున్నాఁడవు చావుపుట్టుకలునున్ జాత్యాదులున్ నీకు వై
కృతులున్ లే"వని మమ్ముఁ దేల్చెదు కృపాకీర్ణాత్మవై శాంభవీ!

286

అమ్మా! యంచు సమస్తమున్ మఱచి యాహ్వానించినన్, బిడ్డనె
య్యమ్ముం జిందుచు వచ్చి "జీవుఁడవు కావయ్యా! యసద్భ్రాంతి పో
జిమ్మం జీరచెఱంగు చాటున నినుం జేర్పంగ లాలింప, మీ
యమ్మన్ వచ్చితిఁ గన్ను విప్పు"మని స్తన్యంబిత్తు; సర్వాంబికా!

287

మఱి నిన్నుంగని నాస రేఁగినపు డమ్మా! యన్నచో నిశ్చిత
స్మృతిరూపమ్మున వచ్చి, మాపెదవు మా జీవత్వబోధమ్ము; "నా
సుతుఁడౌ నీస్థితి నాదుసంకమునఁ జూ శోభిల్లు; సచ్చిత్సుఖా
త్మత నీసొ"మ్మని మమ్ముఁ దేల్చెదవు వాత్సల్యమ్మునన్ శాంభవీ!

288

మమతాపంకము మాపికోఁదగిన సామర్థ్యంబు లేనప్డు, డా
మమతాకేంద్రమునం దసహ్యగుణదుర్మాలిన్యమున్ జూపి, భ
క్తమణిన్ దానికి దాల నిల్పె; దపుడా ధన్యుండు నిన్నే కదా
మమతాకేంద్రముఁ జేసి మైమఱచి సంపాదించు సంపాద్యమున్.

289

స్వాంతక్షేత్రమునందుఁ బోరు నసురవ్రాతంబు పైఁ జూపు ర
వ్వంతే న్నిల్పక, నిన్నె చూచుచును, దైన్యంబొప్ప నిన్ బిల్చు నీ
సంతుం గక్కసపెట్టు నయ్యసురసంస్కారమ్ములన్ జండివై
యంతం బొందఁగఁ జేయకుండఁగలవే? అమ్మా! భజద్వత్సలా!

290

భోగము దుఃఖయోని యను బుద్ధి ప్రతిష్ఠితమైన, నీ జగ
ద్భోగమునందు నిన్ను సుఖపూర్ణునిఁగాంచెడి వాని, నీవె నీ
రాగు, నిరాగసుంజలిపి రాసవిలాసునిఁజేసి ముక్తిసం
భోగముఁగూర్తు; వన్నిట విభుత్వము నీయది యాట, శాంభవీ!

291

లలితా! చూడఁగ లోకసంస్థితిని జల్పన్ జీవు లున్మార్గగా
ములు గాకుండను, శాస్త్రరూపముఁద్రయీమూర్తిత్వముం దాల్చి శో
భిలు, దండైశ్వరశక్తిరూపమున నీవే; నీ నియంతృత్వశ
క్తు లచింత్యమ్ములు సృష్టిరక్షకె కదా తోట్రింతు, సర్వేశ్వరీ!

292

తలఁపఁగ నన్నపూర్ణవు, సదా పరితృప్తవు, మా యతృప్తులన్
దొలఁపఁగ హా మొగాలకడఁదోఁచెద నీవె యతృప్తిమూర్తిలో;
తలఁచిన గుండె జల్లుమను, ద్రౌపది నన్నకణమ్ము వేడి, య
య్యలిని మనస్సుతోఁగలిపి యాఁగరుణించిన గాథ; మాధవీ!

293

దురవస్థంబడి పౌరుషమ్ము వితమై దుర్గా! తనున్ గావ, నే
వెరవున్ లేక, విపద్ఘనమ్ము లలమన్ భీతుండు దిగ్భ్రాన్తుఁడై
యరికట్టంబడి, దీనుఁడై, శరణమం చన్జేయమా శక్తివై
పరయున్, గుయ్యిడు, మ్రొక్కు; నవ్వు డెవరమ్మా! కాతు రీవే కదా!

294

అమ్మా! యంచు ఛలమ్ము మాని నిను నాహ్వానించు సత్పుత్త్రశ
బ్దమ్ముం బోలిచి చేరఁదీయుదువు వాత్సల్యమ్ముతో; నీదు నె
య్యమ్ముం బోల్చికొనంగ లేని నరులే యూనాఁడు నీబావతో
సమ్మాన్యాత్ములటంచుఁ బేర్కొనుట విస్మార్యంబె? కృష్ణాకృతీ!

295

నేనన దేహమే యనెడి నీచత, నీకృపచే నడంగఁగా
మానసనీమఁ జేరియుఁ గ్రమంబుగఁ గాదని, బుద్ధియందు వి
జ్ఞానమునందుఁ జేరియును, సాధకుఁ డయ్యదియుం జడమ్ముగా
నే నెఱిఁగెమ్ము చేసినను నివ్వెఱఁ జేయు టదెంత? శాంభవీ!

296

గురుశాస్త్రాత్మకృపాప్తి లేకెవఁడు ముక్తుండౌను? నీవే శివా!
గురువై శాస్త్రము నాత్మవౌ తెఱఁగి నీకున్ బ్రముక్తిఁ జైతన్యమే
యుఁడనై నీవు, కృపాత్రయాకృతిని సద్యోబుద్ధియోగంబుఁద
త్త్వారాప్లావపటుత్వ మిచ్చెదవు వాత్సల్యమ్ముతో, శ్రీగురూ!

297

దేనం జేరెడి మంచి వాసన సముద్దీపించుచో, 'నిచ్చటన్
నేనంచున్న కురూపి నేను, నిజమా నేన్గాదు; సంకెళ్లు లే
కా నేనో, విభుఁడున్ నిరంజనుఁడు నిత్యానందుఁ'డంచెన్న వాఁ
డే నేన్ నేననునా? త్వదీయకృప లేకీబోధ మౌనా? శివా!

298

అది యిది చేసినాఁడను, గృతార్థత గల్గదు, సంశయమ్ము పా
యదు, దమరలోకప్రాప్తి యిసుమంతయు లే, దభయమ్ము చిక్కదం
చెద నుదుకెత్తు వేళఁ గని, యీవె కృపన్ గురురూపమొంది వ
చ్చెద, విదె నీనిసర్గము విశీర్ణహృదాత్మజరక్షకంబికా!

299

భగవద్భావమునందు జీవుఁడు మనఃపర్యంతమున్ దన్మయుం
డగునే, న్నీవు విశిష్టమూర్తిఁ గొనియే యావిర్భవంబందు, దె
న్నఁగ నీవర్ణన మెల్లసంశయములన్ మాయింప, హృద్గ్రంథి యిం
తిగ శైథిల్యము నొందినట్ల యగుఁగాదా నీకృపన్ శాంభవీ!

300

విగళత్కర్తృతతోడ నీయొడిని సంవేశించి, తానున్ భవ
జగతీఖేలనమందుఁ బాల్గొనినఁ, త్యాజ్యం బంచుఁ ద్యాగంబటం
వగడుం జెందని నీతనూజున, కగమ్యంబైన నీధామమే
సుగమంబౌ, నటఁ జేర్చు నీకృపయె నిస్తుల్యాదృతిన్ శాంభవీ!

301

నేనే యిచ్చెద బుద్ధియోగమనుచున్ శ్రీకృష్ణరూపమ్ముతో
నానాఁ డన్నటు లీయఁగొన్న సుతుఁడే యన్నింటికిన్ సాక్షియై
తానే యుండు టెఱింగి, యెన్నఁడును నీ ద్వంద్వోత్థచాంచల్యముల్
లేనే లేక విశుద్ధబోధమున నిర్లీనుండగున్; శాంభవీ!

302

నిను నెడఁబాసి యార్తుఁడయి, నీదు సభావముచేత దీనుఁడై
నిను శరణమ్మటన్నపుడె, నీత్రిగుణాత్మకశక్తిరూపమున్
గనఁగలఁడమ్మ! జీవుఁ; డలనాఁడె త్వదార్తశరణ్యమూర్తితో
గనఁబడి భీతి వాపి భవకష్టముడంతువు సత్కృపార్ద్రవై.

303

♦ మ్రొక్కెడిచోఁ బదమ్ముల శిరోమణు లొత్తెడి వేల్పులందుఁ, బెం
పెక్కిన భక్తితోడి యిడుకెత్తు శిరమ్ములు వోఁపు మాయెడన్
మక్కువ నీకు నొక్కటియె; ఉమ్మధవహర్మ్యము, పేద యిల్లు, నా
కొక్క విధంబుగా నెఱపకుండునె సోముఁడు చంద్రికల్; శివా!

304

♦ అనయము మా వివేకగతు లారయ నీకును, నీదు తత్త్వమున్
గని, కడతేఱ మాకును జగజ్జననీ! పనిముట్లు గాఁగ నీ
తనువు మనమ్ము నిచ్చితివి, తథ్యమటంచు నెఱుఁగు ధన్యుఁడే
నినుఁగని నిన్నుఁ జేరి జననీస్తనపీడను మళ్ళి రాఁడుగా.

305

♦ చెల్లని రాగిడబ్బు, సరి చెల్లులు పెట్టిన యప్పు పత్రముల్
బొల్లగు విత్తనమ్ముఁ, జడివోయిన వాడి హృషీకముంబలెన్
దల్లిరొ! యింటఁబైని గుడుతుఁ దొలఁగించెడి ముప్పునన్ సహా
యుల్లము నిన్ను నేమఱక యుండుట, యీశ్వరి! నీ క్షమింగదా.

306

♦ పరమాన్నమ్మని యంబటింగుడిచి, పిప్పన్వోఁడిగాఁజూచి, ము
ప్పిరిత్రాటింగని పాముగా నడలి, కంపే యింపుగా నెంచి, క
స్తూరితిన్నేనన మేన యన్న మదిలోఁగొట్లాడుకొన్నట్టి నా
దురితంబూడ్చెడి వేలు త్వత్కరుణసింధుస్నానమే; అంబికా!

307

♦ మందులు లేకయే రుజలు మాన్పుట, శస్త్రము లేకె శత్రులన్
ద్రుంచఁగఁ జేయు, దైనదియు రాఁగల దాని నెఱుంగు, దూరపు దా
లందగు శబ్దము న్వినుసులన్ గ్రహియించుట, యన్న శక్తి ని
ర్మందభవత్కృపారసము రాజిలుటన్ నరుఁడొందు శాంభవీ!

308

♦ ఊపిరియాట తక్క నిఁక నొండెది లేకయె పుట్టు పీనిలోఁ
బ్రాపయి తెల్విరూపమున భాసిలు నీవె క్రమక్రమమ్ముగాఁ
జూపుదు వన్నియు న్నియతి చొప్పున; అట్టి నినున్గనంగ రా
రాపుల నొందనట్టిఁడొక రాతికిఁదక్కువ కాఁడె? శాంభవీ!

309

♦ ఏచిన ధ్యానవేళ నిను నెంతగఁజూచినఁదన్వి పోదు; కన్
వాఁచిన యట్టులుండు నొకనాఁడు నినుందలపోయకున్న; న
మ్మా! చితిరూపవాచుఁడిగ మైలను దోఁచుచునుందు; వింతయున్
జూచియె నిన్ మహాత్రిపురసుందరి వందు రమందధీయుతుల్.

310

♦ పవళుల సందెలన్నిసులఁ బర్ణకుటీరములన్ ధనాఢ్యసౌ
ధవిసరమందుఁ జిట్టడవి తావుల, దుర్గహిమాద్రియందు, నీ
వె వెతకుచుందు వేసరక, విశ్వజనిత్రి! భవత్స్వరూపమున్
దవిలి కనుంగొనందొడరు ధన్యులఁగన్గొని చేరఁదీయఁగాన్.

311

♦ బాలగ మాఱి సంతస మపారముగా నిను నీవె చూచికొం
టే? లలితా! యదేల? కడు వృద్ధగనై నిను నీవె చూచినన్
దేలును మాజరాదశల త్రిక్కులు; డొక్కులు కాకమున్నె మ
మ్మేలవయేని, స్వార్థపరి యీలలితాంబ యటంచు నాడరే?

312

♦ ఎఱుఁగను హోమపద్ధతు లవెట్టివొ; తర్పణరీతి బొత్తిగా
నెఱుఁగను; చక్రపూజ యరుదే; యయినన్ గురుదర్శితాధ్వమున్
మఱువక హృన్మనుప్రకటమార్గమె గమ్యముఁ జేర్చునన్న యీ
యెఱుకను, గన్నతల్లి యెటు పోదువు ప్రోవక తావకీనునిన్?

313

♦ ఊతను వచ్చునంతకును నే నొనరించిన తప్పు లెన్నియో
నాతరమా యెఱుంగ; విడునా ఫలరూపములైన కీడు? లీ
మే తగులాడ్చుచోఁ గఁదగమే? మెడపల్పు సడల్చి వత్సమున్
మేఁతకు వీడునట్టు లిది నీపని; నాపని కాదు; శాంకరీ!

314

♦ ఒగులకు స్వార్థము న్విడిచి యుండుట మేలను వారు, తామె యా
చరణమునందు జాఱుటది సాజమె? జ్ఞానసుఖస్వరూపవై
పరఁగుచు నీవె మీఱుటది స్వార్థము కాదటె? లాలికిచ్చుచోఁ
బారపడుదే యవిద్యవయి పోవుదె యప్పుడు చిత్స్వరూపిణీ!

315

♦ ఆఁకటి కేదో తిండి, దగ నాపఁగ నీరము మాన లేని యీ
నా కడుపెన్ని జీవులను నామమడంచెనో ? దాని పంట నీ
వే కయికొందో, పాచితము లే నొనరింపఁగ లేని నన్ను నా
యాకలిదప్పు లంటునటులైన నొనర్చెదో ? పాపనాశనీ !

316

♦ మనసె భవద్వశంబగుట మైమఱపొందెడి యోగివర్యు, ని
న్ననుగొని వాక్సమర్పణమునన్ దనివొందెడి జ్ఞాని, నీకునై
తనుధనమాత్రమిచ్చి యదె ధన్యతగాఁగను వెఱ్ఱి నాఁగ మర్త్యుఁ
గనుగొని, 'యిందు నేనెవఁడనా'యని కుందుదు నమ్మ! శాంకరీ!

317

♦అమ్మా! జంటలు కొన్ని, యెక్కఁటములు కొన్నొనట్లు, నాకిన్ని య
జ్ఞమ్ముల్గూరిచి, యింద్రియమ్ములను సన్ధానించి; తీచెత్త వ్య
ర్థమ్ముం జేయక మళ్లి నీకిడెద; నా ప్రారబ్ధసందోహదా
హమ్ముం జేయుము తెల్వి చిచ్చు నిడి; జ్ఞానాకార! కామేశ్వరీ!

318

♦ పలుమఱుఁదోలుచున్న మెయిపై నడుగూనుచు నేఁచు మత్సరా
దులవలెఁ గామముఖ్యులగు దుష్టులు దాయలు వీడిపోరు; భ
క్తుల కిదియా సహాయ ? మెదఁదోఁపదె నీపని యంచుఁదల్లి! ఆ
ఖలగణనేతయైన యల కాముని కీశ్వరివేమొ ? ఈశ్వరీ !

319

♦దాఁగురుమూఁత లాడునటు, తల్లి! యొకప్పుడు చిక్కఁటుందు; నా
బాగెమిఁకైన, నిత్యసుఖభావముతో సుతుఁదన్పు టెట్టిదా ?
యోగివరేశ్వరీ! యరయు నూహయొ? వంతొ? గ్రహాల యోగమో?
రేఁగిన యగ్గినార్చిన మఱీఁదరికొల్పుట కష్టమాఁజుమా.

320

♦ మానసికమ్ములౌ రుజలు మాయును; మేని తెవుళ్ళడంగు; ని
మ్మేనికి యోనిఁజూచుకొను మేటి శ్రేయమ్ము తొలంగు; దృష్ణయే
మానిన నంచెఱింగి పలుమాఱును గడ్డిన, గుగ్గిలంపు జి
డ్డై నను వీడ, దేమి వెరవమ్మ! శ్రితావనమిట్టిదా నటే?

321

♦ రూపము లేకె చూపెదవు రూపము; రూపము గల్గు సన్నిటిం
గాపొనరింతు; వామెతయుఁగట్టడ మద్గవు; నీవె యిత్తు వే
లోపము చేయ; కైనఁ జెఱలో నటికించితి, వమ్మ వేమొ? నీ
పాపలమేమొ? పాప తమి పాపికొనంగను నోపుదే? శివా!

322

♦ కాములఁ బెట్టకమ్మ; పెనుకాముల పెట్టెలు కాము లెన్న; లో
కామును బట్టఁజాలకె, సకామును మార్చుకొనంగ లేకె, యీ
కాములఁజిక్కుకొంట; మదిఁ కాము నిరుల్వెడఁగొట్టి యేలు, మం
బా! ములుచౌను గాక తన పాపఁడు మాత కుమాత కాదుగా.

323

♦ దినుసులఁదృష్ణ, శాస్త్రములఁదృష్ణ, కవిత్వపుఁదృష్ణ, సద్యశో
ధనములఁదృష్ణ, యాత్మజుల తన్వికిఁదృష్ణ, హృషీకతృష్ణ, యీ
యనువున నున్న తృష్ణ లడుగంటఁగఁద్రొక్కుక, నిన్నుఁజేరు తృ
ష్ణను గొనసాగఁజేయుటది సాధ్యము నీకునుఁగాదు, శ్రీకరీ!

324

♦ జనకుండాదృతిఁజేతఁబెట్టినది పైసా; దానితో ‘‘బైసికిల్
కొనుకొంతా’’నను ముగ్ధబాలకుని పల్కుల్విన్ననుర్, దంభులా
చు నిదిధ్యాసపటుత్వశూన్యులగు నీచుల్ ‘దేవి ప్రత్యక్షమా’
కను టప్పాలను విన్న నవ్వగును, దుర్గా! స్వర్గమోక్షప్రదా!

325

♦ నీవే నేనను మాట నిక్కమగుచో, నీశక్తిభేదమ్ములున్
నావే చేయవదేల? నీకు శ్రమము న్నానీక, నేఁడిప్పనే
నీవంక న్నెడమోము పెట్టు పనుల న్నీవంక కేః యిట్టి స
ద్భావమ్మే ఫలమన్న పుత్రునెడ విశ్వాసమ్ము లేదా? ఉమా!

326

♦ చిరకాలమ్మునుండి నీదగు నుదాసీనత్వమే యెంచి, నీ
చరణమ్ముల్ గయికొన్న యందులకొ, తచ్ఛబ్దార్థమన్యంబుగా
జరగ న్జూచెద? కొన్ని నాళ్ళు పరీక్షాకాల? మా నాయెడన్
బరఁగింతే భవదీయపాండితుల సంబా! నూనుఁడన్, దీనుఁడన్.

327

మఱపా? జ్ఞానమె నీసదాకృతి; అసామర్థ్యంబటే? శక్తివే;
కొఱయా, వత్సలభావ? మాశ్రుతులు పల్కు న్నిన్నె సర్వాంబగా
తఱి కాదందువొ? దెబ్బదైదు వయసు; నీదార్ఢ్యం బెటుల్ నమ్మ? నా
మొఱకర్థమ్ము నెఱుంగుదీవె; వడిగాఁ బ్రోవందగున్; శాంకరీ!

328

♦ నీవే నేనను తెల్వి యింతమఱినన్ నీలోనె నేఁ జేరఁగా
దేవీ! దేవనె యొక్కదారి; అది యాది న్నెట్టకున్నందుకై
యీవే దండుగఁగాఁగ నాయువొక నూతేండ్లిచ్చి, యా తెల్వితో
నీవే నిన్ బ్రకటించుకో; మ్మదియె వాంఛింతున్ జగత్సేవగా.

329

♦ కన్నులు పుస్తకాలకిడె; కర్ణములన్ బుధపాలికిచ్చె; లో
నున్న ననుం గనం డితఁడయో! పతితప్పుఁడటంచు, జ్ఞానసం
పన్న గురూత్తమాకృతిని వచ్చి తెరం దొలఁగించి, తట్టి యా
యున్నతమార్దవమ్మొటు, శిలోచ్చయపుత్రికిఁ గల్గె? శ్రీగురూ!

330

♦ శవతతి యాసనమ్మయి, శ్మశానమె తావయి, పుర్రెపేర్లె జా
నవు నగవై, దెసల్వసనమా నొక యుత్పథలోలకుం దనూ
భవులము; తల్లి పోల్కి గలవారలమా మముఁజేర నోడు మృ
త్యువు; సత మామెనే కొలిచి ధూతభయాత్ములమైతి; శాంభవీ

331

♦ తన మెయి గంట్లు పెట్టినను; త్వక్కును జెక్కి, చివుళ్లు త్రుంచి,
ళ్లను దెగఁగొట్టుచున్న, నది లాతికి మేలని, మంచిదంచు నే
మనియెడి మందుచెట్టుఁగని, మా త్రిపురాంబ కృపామృతాభిషే
చనమును గొన్న వీనికిఁక జన్మము లేదని యాసు చెందెదన్.

332

మనసిజుఁడంట; అఘనుఁడె మన్మథుఁడంట; సెబాసు! పుట్టినిం
టిని వెతపెట్టు క్రూరుఁడనుటే కద; నిన్ను దొంగిలించు దొం
గనిన, 'మనస్సె నే'ననుచు నర్జునుతో నను నర్థమేమి? కృ
ష్ణుని దెగడందగు న్వరుల నొవ్వఁగ నాడఁగ నేల? శాంభవీ!

333

♦ ఒకటే పిచ్చుక జాతి; నీదరచనోద్యోగంబు, బంగారు పి
చ్చుకకుంబిచ్చుక కెంత భిన్నముగఁగూర్చు న్నీవిలాసంబుమా!
స్వకుటుంబమ్మగు జీవు లొక్కటయినన్ సంరతులో భేదమెం
దుకొ నీకే తెలియున్; నమస్కృతులు నీదుర్జ్ఞేయభావాళికిన్.

334

కట్టునఁబెట్ట నిమ్మనసె కారణమంచును దిట్టఁబోను; నా
కట్టడలించు మేలి కదె కారణమాటను నమ్రనమ్రతన్
బట్టెద దోయిలిన్ విడుపుబాటనె త్రిప్పుమటంచుఁ; గానిచోఁ
బెట్టెద నీ మొకమ్మునసె; వేఱొక యెత్తెఱుఁగన్ మనోన్మనీ!

335

గుణమయి! చెప్పవే, త్రిపురగూఢచరిత్రుల దైత్యులన్ మహా
రణమొనరించి చంపుటనె రాజిలెనో, త్రిపురాన్తకాఖ్య నీ
దణికి? శివా! శివోఽహమను తత్త్వధురీణుల స్థూలసూక్ష్మకా
రణపురనాశకుఁడగుట రాజిలెనో? త్రిపురాన్తకాంగనా!

336

♦ పురముల రూపముంగొనిన మువ్వుర దైత్యుల రూపుమాపుటన్
బురమథితృప్రశస్తిఁగనె; పో, భవదీశుఁడటంట యొప్పొ? త్రై
పురమనుబీజసమ్మథనముం జలిపెన్, నవనీత మెత్తె, నీ
వరుఁడదిగాన నీబిరుదు, పార్వతి! యంటయె యొప్పొ? చెప్పవే.

337

♦ ఏతటి నేరు నీదు మతమెయ్యది? యన్న, "జగజ్జనిత్రికం
జాతనిభాంఘ్రులన్గొలుచు సన్మత"మందును; దాని వారల
ద్వైతమనంగ-డూ; యదియె ద్వైతమనంగ-సరే; విశిష్టమైన య
ద్వైతమనంగ - ఛేవ్ - పరమబంధుఁడ నెల్లరకంచుఁ బొంగెదన్.

338

♦ వాక్కులు సర్వ మీవ యని వాగొను వేద మసత్యమానె? యీ
చక్కని తెన్గుతోనె నిను సంస్తుతిఁ జేసెద; నద్యముందు, త్రా
నొక్కనె పీఁక; సంస్కృతము నోరను రాదని? యెట్టి వారిసేన్
గక్కసబుద్ధితో ననధికారము సూపిన నీవు సైఁతువే?

339

♦ అవమానమ్మును గౌరవమ్మును ధనాఢ్యత్వమ్మునున్ లేమియున్
భవదీయాజ్ఞలు, శీర్ష ధార్యములు కావా? దేవి! నాబాధ్యతా
నివహమ్మున్ మకరందపూర్ణ భవదంఘ్రిద్వంద్వసాన్నిధ్యమం
దు విడం, గాలను దన్ని పోఁగలవె? చూతుంగాక వాత్సల్యమున్.

340

పై మాటల్ వెయి యేల; అయ్యవి ప్రగల్భ లెల్లరున్ వేళకుఁ
వామాచారులె; ముఖ్యమవ్వయమునైన న్బొట్టకే, మున్న నిన్
శ్రీమాతా! యన లేరు, నీపరమదాక్షిణ్యమ్ము నార్జింప; ఈ
వామాచారమె దక్షిణమ్మగుఁగదా; వామాంత్రయాకారిణీ!

341

♦ మలినము గాక, నీరచనమాధురి జానగు పుణ్యలాఁగలీ
పులినములందు సాగు మన ముచ్చట లంబరనీరసంచర
మ్ములు విననిమ్ము; తల్లి! తొలి పుట్టుల పున్నెము పండి ముందు బా
ముల నిలుఁగొల్పు భాగ్యమున, ముక్తములై చనుఁగాక, శాంభవీ!

342

♦ ఆతిథ్యమ్ములు లేక సాంబశివపాదార్చావిధుల్ లేక, స
త్పాతివ్రత్యము లేక, శౌరితులసీభవ్యార్చన ల్లేక, శ్రీ
మాతృస్తోత్రము లేక, తాతగురుసమ్మానమ్మును న్లేక, వి
ఖ్యాతిం బాసిన యిండ్లఁగాలిడక దవ్వై పోదు వమ్మా! రమా!

343

మన కడ్డంకు జగత్ప్రియత్వ, మదె యాత్మప్రాప్తి కానీని బం
ధనమం బెగ్గదె, మిమ్ము నన్నుఁగడు సంధానించు నెయ్యంపుఁద్రా
డనియుఁ, బిమ్మట నయ్యదే తగులు పాయంజేయు కీలంచు, నీ
వన వేఁ బిడ్డలు తప్పదారులకు లోనై పోవరే? శాంభవీ!

344

నేనే కోరి బహుత్వలీల, నిటుఁబత్నీపుత్త్రిభృత్యాకృతిన్
నేనే విష్ణువిరాట్స్వరూపనయి సందీపింతు, సేవింతు, నా
నేనుఁ; సత్యమటంచుఁదల్పెదవ యేనిన్, నీసుతుల్ నేనసం
గా నేమో గుణితించి యమ్మవగు నిన్నానంగలా; రంబికా!

345

అకటా! శిష్యుండు గాకె దేశికుండుగా నాసింపంబోకోయి! సా
ర్థకమా శిష్యత నీకె యబ్బిన, గురుత్వంబింతలో నబ్బు; దై
శికదేహంబది మట్టిబొమ్మ యయినన్ సిద్ధించు మోక్షంబు సా
ధకపుత్రా! యని తెల్పి కాచుటది నీధర్మంబు సర్వేశ్వరీ!

346

సకృప న్నీకుపదేశమో, యొకరియో దీక్షాదానమో చేయు దే
శికు, నీవానిఁగ నాంతరంగికునిఁగాఁ జేయంగ లేవేని, దే
శికుఁడే నీవును గావయేని, యిత నీశిష్యత్వమున్, నీకు దై
శికలాభంబెది? యంచు సాధకునకున్ జెప్పంగ దే శ్రీగురూ!

347

అసదవలంబులై, సదమృతార్థవివంచితులై, సదా విష
గ్రసననివృత్తులై, భవదరాతులఁబోలి చరించు మూఢులం
దు సయిత మెన్నఁడుంగనలు తోఁపని కన్నులి నిల్చినప్పుడే,
యసదృశసాధనాప్తిఫల మబ్బిన గుర్తగు మాకు శాంభవీ!

348

అనయము నింద్రియాయనములందగు నాగమనాగమంబులన్
గని నను బట్టుకోఁగలవు నన్నొకనాఁ, డది వ్యర్థమైననుం
వనరకు; నీకు నవ్విఫలభావమె సూ ఫలమిచ్చునంచు, నీ
తనయుల కీవె కూర్పఁదగుఁదాలిమి నెయ్యము మీఱ శాంభవీ!

349

జననీ! నేనన దేహమే యనెడి క్లేశమ్మాడ్చి, యాపైని నే
ననఁగా బుద్ధి యటన్న క్లేశమును మాయంజేసి, యా బుద్ధికం
దని చోటన్ మఱి "నేను నే"ననుచు సంభావింప రానట్టి తా
వున నీబిడ్డనిఁజేర్ప నీదె కదె యాపూటమ్ము; సర్వాంబికా!

## 350

జననీ! సంశయమున్న తావునను విశ్వాస, మ్మసూయాస్థల
మ్మునఁ బ్రేమమ్మును, హాని చోట సహనమ్మున్, నిర్గతాశాస్థల
మ్మునఁ బూర్ణాశను, నిల్పు నొక్క కరణమ్మున్ గా నొసర్పంగదే
నను; నోసర్వనియంత్రి! పరమానందాత్మికా! శాంభవీ!

## 351

ఎన్నఁగ నాకృతఘ్నతకు నించుక పాచిత మిద్దె యంచు, నే
నన్నివిధాల నాత్మబలి యచ్చెదనంచు ముముక్షుభావసం
పన్నత యిచ్చినన్ సకలవాసనలున్ భవదీయమూర్తిలో
నన్నటఁ జేరిపోవు; నిదె నచ్చిన ప్రార్థనమందు శాంభవీ!

## 352

తనయా! విశ్వవిరాట్టు నొందుటకు నిత్యంబీవు నీలోన నే
యనుభూతింగొను వ్యష్టిసత్తయె చుమా, యాధారమౌ; భూమిగ
ర్భనిగూఢంబగు వారిప్రవాహమునకై త్రవ్వించుకోవే పెరం
టను గూపంబని నీదు బిడ్డనికిఁ దేటంబెట్టుమా, అంబికా!

## 353

జననీ! నీపృథుదేహమౌ పృథివిపై మ్మందుఁ బద్మాదికా
సనముంగూర్చెద, ధ్యానయోగినయి, తచ్ఛైథిల్యభీయుక్త, న
న్ననుకంపామతిఁ గావవే, యనెడి వాఁడాత్మార్పకుండంచు, నా
సనశుద్ధింబొనరింతు వీవె శ్రితరక్షాదీక్షతో శాంభవీ!

## 354

ఏకడ నున్నదమ్మ, యని యిట్టటు పాఱకుఁ'డంతటన్ సదా
మీకయి పూర్ణభావమున మీకొదువల్ దొలగింప, నేనె వి
శ్వాకృతితోడ నుంటి'నని యాత్మజకోటికి నచ్చఁ జెప్పుచున్
నీ కడగొట్టు సంతునెడ నెయ్యముఁ జూపుము విశ్వరూపిణీ!

355

నీకరుణాకటాక్షమున నిల్చి యదెప్పుడొ బుద్ధియోగమున్
నాకిడు దేని, దేనికయి నాశ్రమసాధనమయ్యె, దేనికై
వ్యాకులపాటు చెందితినొ యాఫలమబ్బును; దాసి వర్ణనం
బేకవి కృష్ణగీతల ముగిం; పది పెట్టుము భిక్ష శాంభవీ!

356

ఈ సుఖ మొక్కటైన విషయేంద్రియయోగముచేత భిన్నతా
భాసము నొందు; మానవుని భావము భిన్నరుచిప్రకీర్ణమై
మోసము నొందుచుండు, రసమూర్తిని నిన్ను నెఱుంగలేక; యి
మోసమునందు బిడ్డలను ముంపక సత్యముఁ దెల్పు మంబికా!

357

అమలాద్వైతమహానుభూతియుతులౌ నాశంకరాచార్యము
ఖ్యమహాత్ముల్ స్తుతివేళ, వేడు తఱి ద్వైతాధారులే యాట, స
త్యమ కాదా - అది మాకుఁ దప్పనిద కాదా, యట్టిచో మమ్ము భ
ద్రమతుల్ గాఁగని త్రోసివేయకు, జగద్ధాత్రీ! సుతాళికిన్ శివా

358

అమ్మా! ఆత్మవు నీవు; నిక్కముగ 'నే'నన్నట్టి వస్తుస్వరూ
పమ్మున్నీ; వది యొక్కటే సకలజీవవ్రాతమం, దేను వే
సమ్ముం దాల్చి ప్రతిధ్వనించు; నపుడే శక్తిప్రథన్ బొల్చు; భి
న్నమ్ముం జెన్నగు మున్నె నీవనుచు సన్మానమ్ముతోఁ దెల్పవే.

359

దుర్గంబన్న, భయంబు సంసృతియు దైత్యుంబున్ జనదుఃఖరు
గ్వర్గంబర్థము; కొమ్మునందమరి 'ఆ' వర్ణంబు తద్ధంతయౌ;
భర్గార్ధాంగి! జనించె నిట్టులు భవద్వ్యాఖ్య; నాతల్లి! యా
దుర్గానామనిరంతరస్మరణసంతోషమ్ము నాకీయవే.

360

"ఉన్నది జ్ఞానశక్తి, మఱియున్ గొఱఁగానిది, చిత్తశాంతి నీ
కున్నది, నాయహంకృతికి నూఁతయి; కావున నాదు శోకమో
హోన్నతి దాఁటు దారి యొకటున్నఁ గృపం దెలియంగఁ జూపవే"
యన్న యుదారభావమె యథార్థనమస్య, గురుస్వరూపిణీ!

361

అవిరతతాపతప్తమగు నాత్మజబృందము, నీదు స్నేహబిం
దువులకు నోఱు సాఁచుట కనుంగొను, మీయుగసంధియందు. దా
దవులను నిల్వ కొక్కపతి దర్శన మిచ్చెదవేఁ ద్రితాపవ
హ్ని విధుతమై రసార్ద్రమగు నెండిన సస్యము వోలెఁ జండికా!

362

అకటా! నీ జగదాకృతిం గనుచు, 'మిథ్యా భ్రాంతి'మున్నా నిర
ర్థకమౌ మాటలు కొందఱంటకు నిమిత్తంబేదో నేఁగాన నే
రక నిన్నడ్గెద; సర్వభూతములలో భ్రాంత్యాకృతిన్ బొల్తువన్
నికము న్నిల్పఁగ వారి నోళుల నిటుల్ నీవే బయల్దేఱితో?

363

మఱఁగంగోరెదవేని, రూపమును నామంబాఱె, యూహాల్ నుడుల్
మఱఁగున్; నీవు వికాసమొందిననె యమ్మా! నామరూపక్రియా
గణనల్ తేలిక యౌను మా; కపుడు నీకార్యంబులన్ జల్లు మీ
యణుసంతానకృతార్థతాప్తి కనువౌనట్లో గుణాలంబనా!

364

ఎక్కడనుండి వచ్చితినొ, యెవ్వఁడనో తొలి పుట్టువందు, నే
నెక్కడి కేగువాఁడనొ, మఱేమగుదున్ మెయి వీడినంత నే,
యొక్క రవంతెఱుంగ; నిటులున్నను సర్వము నాది యంచు నే
నిక్కి చరింతు; నిట్టి కడు నీచుని సైఁచెదొ, యేఁచెదో? శివా!

375

ఇమ్మని, నిన్నుఁ దెమ్మనుట కేమి మిగిల్చితి వమ్మ! పంచకో
శమ్ముల పుష్టికై దినుసు చాలఁగ నిచ్చితి, వందులో నిజ
సత్త్వమ్ముగు వాని తెల్పెడిని దండిగఁ బెట్టుము, దానిఁ బైకిఁ బోఁ
జిమ్మెడి యాసురీగణముఁ జెండు మటంచు నె చేయి సాఁచెదన్.

376

నిత్యానందద! జీవికాకృతిని సందీపింతు వీవన్న యా
సత్యజ్ఞానము జాఱి, లేములు నిరాశల్ గ్రమ్మఁగా, నింద్యదు
ష్కృత్యమ్ముల్ బురడాలు లంచములు హెచ్చెన్; బిడ్డలం బేదలై
నిత్యమ్మేడుచు భారతీయులకు నీ సిక్కచ్చి యెట్లూడ్తువో?

377

తల్లీ! తల్లి! యటంచపారమగు నుత్కంఠన్ ద్వదంకాధిరో
హోల్లాసమ్మున నుండ, మోహినివి తుల్యోత్కంఠతోఁ బిల్వక
ల్లలన్ దవ్వగుచుందు; వింతకును మా యాత్మార్పణాభావమే
తల్లీ! హేతువు; దాని నేర్పఁగదె వాత్సల్యమ్ముతో నిప్పుడే.

378

తొలుదొల్తన్ బరజన్మజన్మములయందున్ నాబహుత్వాశలే
తల నిక్కించుచు నాదు చిత్తమను క్షేత్రమ్మందుఁ గూర్చుండె శ
త్రులయ్యె, నీవె కరాత్తఖడ్గవయి శత్రుచ్ఛేదమున్ జేయవే
నలవే? నాకట నీకుఁ దావిడెడి ధైర్యంబేది? శ్రీచండికా!

379

జననమె యిమ్ము; మోక్షమె యొసంగుము, తత్పరశర్మరూపవున్
గనఁగఁ బ్రపంచదేహవును జ్ఞాననిసర్గవు రూపహీనవున్
వినతకృపానిధానమవు, విశ్వజనిత్రివి, భూతధామవా
నినునె భజింపనిమ్ము వను; నీదగు చిత్తమె నాదు భాగ్యమా.

380

తల్లీ! క్రమ్మెను నీ ప్రియాత్మజుల మిథ్యాభ్రాంత్యవిశ్వాసముల్
పెల్లై కాముగదార్తు లల్లుకొనె; నాశీర్వ్యాతతవై నీకృపా
ఫుల్లాలోకసుధాభిషేచనముచేఁ బూటకాత్ముల్ జల్పిజ్ఞ
నోల్లాసాగదరత్నయోగమున మమ్ముల్లాసులం జేయవే!

381

డెబ్బది యంచొకం, డొకఁడు డెబ్బదియొంజన, నీవొ "అబ్బరో
డెబ్బది తొమ్మిదేదులు పటిష్ఠశరీరు నొనర్తు నంటి; వా
నిబ్బరమూని నీదుపదనీరజసేవకుఁజాల వీలటం
చుబ్బుదు, నాఁటిమాట మదినుంచుము మర్వకు, కాలరూపిణీ!

382

మంచుల కివ్వి మంచి బహుమానములంచును గొన్ని, నీవు గా
వించిన దుండగమ్ముల కివే యని గొల్సులు కొన్ని నాకు బం
ధించితి; వివ్వి దుల్చుకొను తేఁకువ నాకెది తల్లి? నీవె మే
లెంచి సడల్పఁగా వలయు; నెప్పటికో పరిపాక? యీశ్వరీ!

383

అజ్ఞుల్ కర్మపిశాచయక్షిణుల నాయాసమ్ముతోఁ గొల్తు రి స
ర్వజ్ఞత్వాశను, నీకె రూఢమయి సర్వజ్ఞత్వమేపార; క్షే
త్రజ్ఞా! చందనభూరుహాభ్రమను దత్ప్రాంతోత్థమౌ వేము నే
యజ్ఞానమ్మున నాశ్రయించునటు లమ్మా! సర్వశక్తిప్రదా!

384

నీతలఁపేమొ, సర్వజననీ! సకలంబునఁ బ్రజ్ఞరూపునన్
ఖ్యాతి వహింతు; విప్డు నరునందున, సర్వము ఱెప్పపాటులో
భూతి యొనర్చు దివ్యపనిముట్టులఁ బన్నఁగఁజాలు ప్రజ్ఞవై;
తీతెఱఁగెన్నఁగా మొదటికే తలపెట్టితివేమొ? భైరవీ!

385

♦ అమ్మక! నిన్నుఁబూజలను ధ్యానములన్ జెలఁగించు వారి హ
స్తమ్ముల నెల్లఁగూర్చి మొలత్రాడుగ, వారల పుర్రెకూర్పు హా
రమ్ముగ, వారి పీడ వెద రాక, ధరించితి వంచెఱుంగకే,
యిమ్మగు నీపదార్చ మతిహీనులు చేటనుచుంద్రు, కాళికా!

386

♦ ఒకమఱి చెల్మియైన మఱి యొగ్గదు పిట్టలజంట; అగ్నిసా
క్షికశపథంబు లెక్కఁడిది? సీ! నరు పెండ్లిఁదలంచుకొన్న, ల
జ్జకుఁగతమాను; మానిసిది సాహసచంచలభావమాటచే
సకలజనిత్రి! నీవిడిన జ్ఞానము మాటెనో? పెట్టుటెంతయో?

387

♦ కూరుకు తిండి కూటములకుం గడవన్నిగులైన కాల, మా
కూరుకు తిండికూటములకుం దగు దిన్నలు కూర్పఁబుచ్చు చా
చారి నటించుఁద్రిప్పుకొని, సత్యమిదే యను మర్త్యుఁడౌర! త
న్నారసి నిన్నునారసి సుఖాప్తిఁగనండిది వింత; మోహినీ!

388

♦ ఔరా! మూర్ఖజగత్తు! చిన్నటని గాయత్రీమహావిద్య నో
రారం గైకొని, మూడికిందుడిచి పాడై పోవులే కాక, యే
ధీరుండేన్ జననీమనుప్రవణుఁడై దీపింప, నిమ్మాతృకా
జారుల్ తప్పనుచుంద్రు రెండు నెఱుఁగన్ సత్వమ్ము లేకమ్మికా!

389

♦ తన మెడఁపోఁగు కందువను, దారల కుత్తుకత్రాటి సత్తెముల్
గనుఁగొను వాఁడె జాణ; అది గానఁగ నేరని వాఁడు రెండునున్
పెనవడఁగూర్చి పెండె కురిపెట్టుక చచ్చుట మేలు; కానిచో
మనుజతలో ద్విజత్వమును మంటను గల్పుటె కాదొ, శాంభవీ!

390
భవదీయాంధ్రుల మున్నిపోఁగల సుభోపాయమ్ము లెన్నేని, మా
నవకల్యాణమె కోరి చూపిన జగన్నాసవ్యర్షు లెచ్చోటఁబా
రివదేహమ్ములఁదాల్చి, రిచ్చటనె యీదేహమ్ముతో నిల్పి, న
న్నవమానించెదె, ధీవిహీనజనిపాత్రాయాసిగా? నంబికా!

391
"అమ్మవు నీవు, సుప్రకట వందఱి, కీవు ప్రసన్నవౌట, 'మా
యమ్మయె మాకుఁగావలయు'నంచుఁదపించెడి వారినెల్ల స్వాం
కమ్మునఁజేర్చి, యెన్నఁడు దిగంబడ నీక, చెఱంగుచాటునం
దిమ్మిడు"దన్న నమ్మరది యీవె సుతాళికిఁజాటు మంబికా!

392
వెలయఁగ నాత్మయే ప్రకృతివేషమ్మునన్, మఱి మాయరూపునన్
దలిరుచు శక్తిగాఁగ, నదె తాలిచె నయ్యాయి పేళ్ళ; నీయదే
కల తెఱఁగాత్మభిన్నములు కావనినన్, దవు చూపు లేని తం
బులకది నచ్చకున్న; దెటు బోధ యొనర్తువొ నీవె, శ్రీగురూ!

393
అమ్మ యథార్థతాపరిచయమ్మె యనంబడు జ్ఞాన; మమ్మపైఁ
బమ్మిన ప్రేమ నిల్పుటయె భక్తి యనంబడు; భక్తిలో నదే
నమ్మను గూర్చి చేయు పని యంతయుఁగర్మము; గాన నెద్దియే
నమ్మనె కూర్చి చేయుఁడని యార్చినఁజేయ రదేమి పాపమో!

394
వెదకెదరేల యమ్మకయి, విశ్వము తానయి నిండియుండ? మీ
వెదకెడి కన్ను మూసికొని, విన్నది కన్నది మీతలంచు న
య్యాది, సకలంబు నమ్మ, యనినంతనె కన్బడు నంచుఁబోరినన్
బదిఁబది నమ్మ రేల కడుబడలు తమ్ములు; విశ్వరూపిణీ!

395

అవునా, నీజడతాసురాత్రి విడునా, అమ్మా! మహాప్రాణరూ
పవు నీవే నలువైపులన్ మలసి యుద్భాసించుటన్ విస్మరిం
చి, వివేకాంధులమైన మాకు? నెటు రక్షింతో త్రితాపాగ్నిహే
తి వెసంగ్రమ్మిన హేతు వీయదియ కాదే; యెట్లు చల్లార్తువో.

396

నల్లని తల్లి కాళి, యనినన్ వెఱపించెడి మాటలాడుచున్,
తెల్లని తల్లి వాణి, యన ధీరతఁ గొల్పెడి మాటలాడు నీ
కల్లరి మూఁక, నీకభిముఖంబగు సంతతి మోము మార్చ కీ
డెల్లఁ దలంచు మాయుకుకు నెప్పుడెటుల్ తొలఁగింతొ? కాళికా!

397

సురథసమాధు లెందఱో విశుద్ధులు నన్గని యాదరింత్రు; నా
మెరమెరఁ దీర్పఁ జాలు నొక మేధసుఁ జూపవు; నీవె మల్లి స
త్కరుణను బాసలై విషయకాననమందునఁ ద్రిప్పఁ బూనితే?
వెరవిదటే? బలంబఱిన పెత్తనమందిటు; భక్తవత్సలా!

398

ఇదిగో, యర్పణమందు లోపమిసుమంతే లేనటుల్, తల్లికీ
వెదియే నిమ్మది శక్తిపూర్ణమయి, నీకే మళ్లి వచ్చుంజుమీ,
యదియే మాతృత; అర్పితమ్ములఁ దియే యాఁగాక, చింతింప క
ష్మదయాలుత్వము మచ్చుచూడు మనినన్ మాతంబి యూఁకొట్టఁడే

399

స్తనయిత్న్వంతరగుప్తచంచలలఁ బ్రజ్ఞన్ లాగి, మా యంత్రచా
లనదీపజ్వాలనాన్నపాచనకృతుల్ చల్పింతు మేమం చహం
తను నిక్కించెడి వారికెల్ల, మనుజత్వమ్మిచ్చి ప్రజ్ఞాకృతిన్
మను విద్యుత్తవు నీవె యంచెఱుఁగు సామర్థ్యంబు లేదంబికా!

400

అడుగడుగందు, శ్వాసగతియం, దఖలేంద్రియచాలనమ్మునం
దుడుఁగని జ్ఞానరూపమున నొప్పెడి నిన్ను గ్రహించుచుండి యె
న్నఁడు నొకసారి, అమ్మ! యని నమ్మికఁబిల్వక నాదరించు మా
దుడుకుఁదనంబె నిన్ను నెడఁదోలెను మాకని కుందెదర్; శివా!

401

కన్న కుమారు లెంత వినుఁగన్నడ చేసిన, నీవు స్నేహసం
పన్నవు బాధ్యవై మఱలి వచ్చెద; విట్టి యనాదరమ్ముతో
నెన్ని యుగమ్ములో చనియె; నిప్పుడు మానుషదేహమబ్బినన్
గన్నులు విచ్చి నిన్గనని కర్మల మింకెపు డౌదు? శాంభవీ!

402

దయ లేకెంతగ నీవు బుద్ధిమయకేంద్రమ్మందుఁగాలూన్చు యో
గయుతిన్ వేళను దవ్వు సేయుదువొ, నిక్కంబంతఁగా మాకు పై
పయిక్ష్వేళనిగారకారణ మెటుల్ శాంతించు? నీవు త్రిసం
చయమున్ ద్రాగఁగఁజేయుదే విషము? నోసర్వాంబ! సర్వేశ్వరీ!

403

నతులర్పింతుము పెక్కు రీతులను, దాన న్మాయమహాంతాశిరా
నతి యెంతయ్యెనొ, తత్ప్రతిష్ఠయును విజ్ఞానమ్మునం దెంత యు
న్నతి యీడేఱెనొ; యెన్న లేనపుడు మా నమ్రత్వ మన్వర్థతా
చ్యుతమై నీయొడి కెంత దవ్వులనొ మమ్మున్ంచున్నదా; శాంభవీ!

404

తొలుత గురుప్రణామములతో, గురుమూర్తిని నిన్నె కాంచి, యా
వలఁదలతో నహంతను భవచ్చరణార్పిత మాచరించు లే
సులువుగ నాత్మరాజ్యమునఁజొచ్చు దువార మిదొక్కటే కదా!
తెలియరు కర్మసాధన మిదే యని యజ్ఞులు కొందఱంబికా!

405

చాలఁగ నమ్మకమ్మును నసంశయమన్న రసాయనమ్ములన్
శాంసుతాళి కీయుమినె, భ్రాంతి జడమ్మును మిథ్య యంచు ని
ర్మాలవచోవిశేషములు నీసకలాకృతికిందగిల్చి, జ్ఞా
నాలయ మంటసిల్ల నడుగాడని దుర్బలులైరి, శాంభవీ!

406

పలు తెగలౌ నభావముల పట్టిక సిద్ధము చేసియే, నినుఁ
బిలుతురు; జీవభావమును వీడక నిత్యముతోడనే నిగా
కలుపక, వెఱ్ఱి మొఱ్ఱి దరఖాస్తులు పెట్టిన బుట్టదాఖలా
ఫలమగు నన్నునుం జెవిని బట్టను తంబులు, చూడు మంబికా!

407

కనఁగుడ్డల్ ధరియించు వానిఁగని మోకాళ్ళంబడున్; నిక్కమా
రసియైనన్ సహజంపు వేసమున మార్పుల్ లేని పుణ్యాత్ముపై
విసువుంజూపు స్వకీయుఁడైన; నిది నీవే భ్రాన్తివై సర్వభూ
తసమూహమ్మున నుండు హేతువునఁగాదా? చిత్రలీలావతీ!

408

కర్మఫలమ్మె జ్ఞానమగు; కర్మమె రూపముఁగాఁదలిర్చు, నీ
ధర్మము తత్ప్రకాశకము; తల్లిరో! జ్ఞానము నిత్యమాట స
ద్ధర్మవిదుల్ సుధాభిదను దానినిఁ బేర్కొని; రట్లు గానఁ, ద
త్కర్మఫలమ్ము సైతము సుధాప్రథతో శ్రుతి పల్కు, శాంభవీ!

409

తనకంటెన్ బరమైన జ్ఞాతృపరతత్త్వంబందు లీనమ్ముగా
మన, సానాఁడమనస్కుఁడై నరుఁడు కుంభప్రఖ్యమా వాయుచా
రనిరోధంబయి, కుంభసంభవుఁడు నాఁ బ్రఖ్యాతుఁడై, శ్రీహయా
స్యుని శుశ్రూషఁ ద్వదీయతత్త్వలహరీసుస్నాతుఁడౌ; నంబికా!

410

జననీ! చండికవౌచు నీవు నిశితాసంకల్పనాస్త్రంబుఁజే
తనుఁబెట్టంగరుణించు నాఁడె, చలచిత్తప్రఖ్యమర్త్యారిఖ
ణ్డనముంజేసి, ప్రశాంతమైన భవదబ్జంబెక్కెడున్; గాదినాఁ
డనయంబున్ జనిచక్రయంత్రణము పాయంబోదు; రాజేశ్వరీ!

411

అరయఁగ నింద్రియాలు విషయమ్ములఁ జేరుట, యవ్వి స్వాంతమున్
దరియుట, యద్ది బుద్ధికడ దార్చుట, యప్పుడు బుద్ధి నాకడన్
దరియుట, నేను నీకడను దారఁగ నీవయి పోవు టంతయున్
బరఁగును యోగసంజ్ఞ; నదె వాస్తవమంటివి కాదె? శాంభవీ!

412

మా సకలాంబయే సతము మాకు సుఖాప్యపథార్థ; మామెయే
యీసకలంబుఁదాన యయి, యేసరు నెల్లెడ; నన్న గాథవి
శ్వాసియె, శ్వాసరోధముఖసాధన లక్కఱ లేకె, తాను వి
శ్వాసియగున్; సురాగమవు వత్తువు కోరినయంత, శాంభవీ!

413

అమ్మా! తోఁచును శాస్త్రవాక్యములయం దాపాతదృష్టిన్ విరో
ధమ్ముల్ పెక్కులు; జీవునందెపుడు మేధారూపవై నిల్చి స
త్యమ్ముం దెల్పుదో, నాఁడె నీవు విదితాఖ్యన్ బొల్తు; శాస్త్రార్థమ
ర్మమ్ముల్ బైలగు నాఁడె జీవుఁడెడయున్ బంధమ్ములో, శాంభవీ!

414

నినుఁగనెనేని బ్రాహ్మణుఁడు; నిన్ననుదారి క్షతంబులోర్చు వాఁ
డనఁదగు క్షత్రియుండు; భవదాదరసీమఁ బ్రవిష్టుఁడైన వాఁ
డనఁబడు వైశ్యుఁ; డమ్మ పదమందక శోకమునన్ ద్రవించు వాఁ
డనఁబడు శూద్రుఁ; డీయదె యథార్థము నాలుగు జాతులంబికా!

415

శోకార్తుండును, క్షుత్పరీతుఁడును, దుగ్ధేచ్ఛుండునుం జిత్రహా
హాకారమ్ములు చేసి చేసి, తుదకం దానందపుంజాడనె
ట్లో కన్గొందుదు; నీస్వరూపమట నెంతో గుప్తమైయుంటచే
లోకంబాకులపాటునొందు, నిది నీ లోపంబు కా, దంబికా!

416

కరుణాసాగర! తల్లి, పుత్త్రుని యహంకారమ్ము క్షుద్రత్వముం
బరిణామిత్వము మాపి, యే తనువుతోఁ బ్రత్యక్షమై కట్టనాల్
విరియంజేయునొ, యట్టి మూర్తిఁగని, నిర్భీతిన్ దదీయాంకవి
ష్టరముం సాధకపుత్త్రుఁ డెక్కుటకు నీవన్మాత్రముం జంకునే?

417

మనసే యీయక మేను వంచు జనునిన్ మన్నింప; వానప్రవృత్తిన్
గని సామాన్యులు వాని భక్తుఁడనుకొన్నన్, నీవు సర్వజ్ఞవౌ
టను నీకంటిని డాగురింపఁగఁగలండా? వాని యీ యాత్మవం
చనమే నీకెడముంచి త్రిప్పును జనుశ్చక్రమ్మునం దంబికా!

418

మము రక్షించుట యన్న, నీవొక తెవే మా సౌఖ్యదుఃఖాకృతిన్
దమితో వత్తువటన్న సత్యమునుఁ జిత్తమ్మందునన్ మర్మమ
ర్మములన్ నాటఁగఁజేయుటే; యపుడె సూ మమ్మేఁచలే దీబహు
త్వ, మిదే రక్ష; మఱేమి కావలయు జీవభ్రాంతులూడ్పన్, శివా

419

అమ్మయె సత్కృపన్ వెలయు నప్పుడె లోపల బుద్ధియోగరూ
పమ్మున, 'నాకు నమ్మకు లవమ్మును భేదము లే'దటన్న ని
క్కమ్మది నాటినట్లు; విని గ్రంథములం గని యూఁదువారి భా
ష్యమ్ములు కేవలమ్ము శుకశారుల పల్కులు కావె? శాంభవీ!

420

సుమహత్తత్త్వవికాసమైనపుడె తోఁచుఁగా జీవునం, దెన్ని జ
న్మములే నెత్తిన, మార్పులెన్నొ యయినన్, మత్తేంద్రియగ్రాహ్యభా
వము లెంతే వెలిఁబెట్టినన్, సతము "నావాసమ్మఖండమ్మ" ని
త్యమునా సుస్థిరసత్త యంచు; నదె నీయంకమ్మటంచున్," శివా!

421

జీవుఁడు బుద్ధితత్త్వమునఁ జేరిన యంతన, మున్ను తెంపు లే
కే వికసించి, వానిఁదలక్రిందులు సేసిన భావరాసు, లా
జీవుఁడటస్థసాక్షి యని, చేరక శాంతిలి ఛాయలట్టులై
పోవును; మాకు దీని సరి పుణ్యఫలంబు మఱేది? శాంభవీ!

422

"నీమహిమంబుఁ దెల్పునది నీదగు రూప"మనంగ, నీజగ
న్నామకరూపమంచు నొక నాఁడెపుటర్థముఁ జెప్పికొన్నచో
'ధీమహి భర్గ'యంచొక ప్రతిజ్ఞకు సూటిగ ధీప్రచోదన
స్థేమఫలాప్తి జీవునకు సిద్ధము కాదటె? సర్వసిద్ధిదా!

423

అనుభవమయ్యె నాకు సకలాంబయె ప్రాపని; నాకవశ్యమా
పను లెవి లేవు; సాధన లవార్యవిశుద్ధిని బొందు; నేను నగ్నవ
త్తునివలె నీయొడిన్నిలిచి, చూచుచునుండెద; నన్ను మొండి బి
డ్డను దిగఁద్రోయఁగాఁగలవె? డంబము లేక వచింపు మంబికా!

424

తనుముఖ్యమ్ముల నాత్మబోధ విడి, ధీతత్త్వాధిరోహమ్ము చే
సిన బిడ్డం గని నీవు డిగ్గుదువు ధీక్షేత్రమ్మునం; దాస్థల
మ్మునె బృందావనమంద్రు వైష్ణవులు; శైవుల్ దానిఁ గైలాసమే
యనఁగా, నేను నుతింతుఁ దత్పరమధామాఖ్యన్ జగత్పావనీ!

425

చాతుర్వర్ణ్యవిభాగమే తెలియు సృష్టంబైన సర్వంబునం,
దీతత్త్వమ్ము నెఱుంగలే [illegible]మతులై స్వేచ్ఛాహితాహంకృతిన్
బూతాపూతములందెగించి కలగల్పుం జేయ నీ నేమముల్,
నీతాజ్ఞాబల యట్టులుంచుటది దేవీ! ఆటమా? లీలయా?

426

లలితా! నీనియమంబు లంతట నసుల్లంఘ్యమ్ములై తోఁచి, మ
ర్త్యాలయందయ్యవి వ్యర్థమౌటఁగనఁగాఁదోఁచుంగదే - యింతలో
బలితంబౌ పరివర్తనమ్మొకటి నీస్వాతంత్ర్యముం జూపుచున్
విలయాశంకముగా నొనర్తు వనుచున్, విశ్వేశ్వరీ! చండికా!

427

హెచ్చుందగ్గును లేక సర్వమున నిన్నీక్షించి, సర్వమ్ము నీ
యచ్చంపుందనువంచు, నందలి విమర్శాకార మీవంచు, నీ
సచ్చిద్రూపమెఱుంగు బిడ్డలె భవచ్ఛాతాకృతిస్నిగ్ధులై
నిచ్చల్ నీయొడిఁజెంగుచాటునఁదమి న్నిల్వంగలా రంబికా!

428

నీ పరమార్థముందెలిసి, నిత్యసుఖానుభవమ్ముతో, నెవం
డౌపనిమన్మహర్షిసముఁడై, తన పల్కులు మేలుకొల్పులై
చూపులు సత్యవస్తుపరిసూచకమార్గణదీపకాన్ములై
యేపు వహించు నాపురుషుఁడే భవదగ్రసుతుండు, శాంభవీ!

429

దాసోఽహమ్మని చేరనా? వలదు; సన్తానమ్మనం చక్కసం
వాసమ్ము న్వరియింపనా? వలదు; నీ బంధుండనంచేగనా?
వాసింగాన; "సహం త్వమేవ"యని విశ్వాసుండనై యున్నచో
మోసమ్ముండునె? తల్లి! నీవపుడు నాముద్దెట్లు చెల్లింతువో,

430

ఏ యవ్యక్తమునుండి పుట్టునో మన, స్సీ చిత్తవృత్త్యుద్భవం
బే యవ్యక్తమునుండి యై మజిల నందే చేరునో, సాధకుం
డా యవ్యక్తము జాడనే యెఱిఁగి, యట్లే నందుకొన్నప్పుడే
డాయున్ నీ పరమాత్మరూపమును గష్టమ్మింత లేకే; ఉమా!

431

అన్యాసక్తులు మాని మాతృపదసన్న్యస్తాత్ముఁడౌ వాని చై
తన్యజ్యోతి యొకింత క్రుంగక, ధుతాన్తర్ధ్వాన్తుఁగా, ధర్మిఁగా
ధన్యుంగాఁ బొనరించు; సక్రమముగా దర్శింపఁ జేయున్ జగ
ద్ధ్వాన్యాలోకము లేని తావు; నదె నీ ధామంబు, సర్వేశ్వరీ!

432

గురుతర యోగనిష్ఠలు వికుంఠితముల్; భవదంఘ్రిపూజనా
దరమున వెల్తి; శాస్త్రహితధర్మరతిం గడుఁ జీఁకు; స్తోత్రకా
ర్యరతుల నోపికల్ కొఱయె; నైన భవన్ముఖలగ్నదృష్టినై
నిరతము నుండు సాధనము నీకెటు నచ్చునొ చెప్పుమా; ఉమా!

433

మాయాశబ్దము విన్నయంత మదిలో, మాతృత్వముం గొన్నదీ
మా యాత్మాఖ్యకృపాబ్ధియే, యనెడి సమ్యక్తత్త్వమే తట్టు ని
ర్మాయుల్ నీసుతులెంతో చన్వునను జేరన్ వత్తు, రవ్వారికిన్
మాయం దాటఁగఁ జాలరన్న నుడి భీష్మంబౌనె? మాహేశ్వరీ!

434

ఆసురవాసనార్దితుఁడ నంచు నెఱుంగు క్షణమ్మునందె, వి
శ్వాసముతోడ నేడ్చి, నిను సాధకుఁడమ్మ! యటంచుఁ బిల్వఁగా
నీసహజానుకంప రవణిల్లఁగ నీ రణరంగిచండికా
భాసురమూర్తితో నసురభావములం గడతేర్తు వంబికా!

435

ధనహేత్వాజిజయాప్తికే విజయునిన్ దామోదరుం డాజిభూ
మిని దుర్గన్నను మంచున్ గొల్వుమనుచున్ మేల్కొల్పలే; దాతఁడే
తన యాచార్యత సిద్ధినొందుటకె గీతారూపమా యోగసా
ధననావాజి జయాప్తికే యనుచు సంతానమ్మతోఁ జెప్పవే.

436

తలఁపము నిన్నె యాత్మ యని; తప్ప కొకప్పుడు నాత్మదానమున్
జలుపము; నీవె ప్రాణమని సందియమున్ విడి పల్క; మందుచే
మలయవు భక్తిరూపమున మాహృదయమ్ములఁ, గాన నీయెడన్
బలితఁపుఁజన్వుతోడ సధివాసము చేయఁగఁజాల మంబికా!

437

జనని మహత్త్వ మింతెఱుఁగఁజాలని కున్నలు సైతమంద్రు "మా
జననియె గొప్పదం," చటులె జంకక నీయమితప్రభావ, మే
మును వినుతింతు; మూరకది పోవునె? పోవదు; మా యసద్వచో
వినుతులె మా ముఖమ్ములఁ బవిత్రము చేయును నిక్క మంబికా!

438

ననుఁజీర్వాఱికె యెప్పుడుందు వనుచున్ నన్ను న్గరాలంబధీ
రునిగా నుంచితివంచు, నా నడకతీర్పుల్ నీ నియంతృత్వ స
త్తనె సిద్ధమ్ము లటంచు, నమ్మకొని యాత్రంజేయు మాత్ర స్తితా
ఘనవిశ్వాసికి దుర్గమంబనుచు విఘ్నంబంచు నున్నే? శివా!

439

తనయస్నేహవిమూఢయా జననియే, తావచ్చుఁజండాకృతిన్,
జననీస్నేహవిమూఢుఁడౌ తనయుఁడే, చండాకృతి న్వచ్చు మా
తను నిర్భీతిఁగనంగఁజాలును, సమస్తంబందు శ్రీమాతృద
ర్శన మభ్యస్తము వానికౌటను; యథార్థంబే కదా? చండికా!

### 440

అమ్మ నదేడనో వెదక నక్కఱ యేటి? కసంఖ్యమైన శ
బ్దమ్ముల యందు, నందు నవి తప్పక యమ్మయె; నాజపించు మం
త్రమ్మది యమ్మ, 'అమ్మ'యను నామము నమ్మయె; నామనామిభే
దమ్మెద నెన్నకే పిలువఁదప్పక పల్కుదు వీవె, వాఙ్మయీ!

### 441

పలు తెగ లాటలాడుకొని, పార్థివధూళులఁ బూసికొన్న కొ
మ్ములఁగని సైఁప లేక, తమ కోరి రచించిన మూఁడు బొమ్మరిం
డ్లలవునఁగూల్పఁజండతరవై చనుదెంచెడి నిన్నుఁజూచి, యే
యలుకును లేక చేరఁజను నాత్మజులే కడు ధన్యులంబికా!

### 442

అమ్మరో! నీపదాబ్జముల నాత్మసమర్పణచేయఁగల్గె నే,
నమ్మయె చండికాతనువు నంది, కృపాళుత మూడు ముళ్ళ భే
దమ్మొనరింప వచ్చెనని, తాన యెఱుంగఁగలాఁడు సాధకుం;
డిమ్మడి వీడ నందనుక నీభవపీడ తొలంగునా? ఉమా!

### 443

ఎందు భవత్స్వరూపమగు నీజగమందున నున్నదెల్ల నా
నందమె కాని, దుఃఖమను నామముతో నొకఁడేది? యంచు నా
నందమయిన్ నినుంగను చనారత మీజగమంద యుండి, యా
నందమయుండ యా చమరనాథుని సంపదఁగేరఁడే? శివా!

### 444

జననియె చండవేషమున సాధనరంగమునందు డిగ్గి, పు
త్త్రిని వెతపెట్టు నాసురవిరోధికభావములెల్ల లీనముల్
పొనరుచు; నమ్మ ముచ్చటయె పుత్త్రికు నైక్యమునందుఁజేర్చు న
చనుభవ మొందుచుండు భవదాత్మజులే కడు ధన్యు; లంబికా!

445

జననాంతమ్ముల, దుఃఖసౌఖ్యముల, రుక్స్వాస్థ్యమ్ములందన్నిటన్
జననీస్నేహవికాసమే కని, జగత్సంబంధికంబందు, సా
ధనరాజ్యమ్మున మాతృమాంగళికహస్తస్పర్శసాక్షాత్కృతిన్
గనుచున్ సాధకపుత్రుఁడక్షయసుఖాకారన్ నినున్ జేర్చుఁగా.

446

ఏనే యిల్దొరనంచు, నీమిగులు నాయిల్లాలుఁబుత్త్రాదులున్
నా నౌకర్లని యెంచు మూఢునకు జ్ఞానంబున్నదా? వారికిన్
దా నే నౌకరు నంచు నెంచికొనుచున్ దద్రూపవై నీవె, యా
త్మానందంబిడుదంచు నెంచు నతఁడే యాత్మజ్ఞుఁడౌ, నంబికా!

447

నగ్నశిశుండు వోలె సుఖనర్తితచిత్తముఁద్వత్పదాబ్జసం
లగ్నమొనర్చి, నిత్యతరళంబగు నింద్రియవారధాటి కు
ద్విగ్నుఁడు కాని పుత్త్రి నోడి దింపక ముచ్చట లాడికొంచు, ని
ర్మగ్నవు కావె శర్మజలరాశిని నీవును? భక్తవత్సలా!

448

ఆలిన్ స్వార్థము గాఁగ నెంచి, సుతు నాత్మాభిన్నుఁగాఁజూచి, బం
ధ్వాళిన్ స్వీయసుఖాప్తిసాధనముగా నాలించి, తద్వర్గమం
దోలిన్ నిన్ దిలకించు సాధకుఁ డుపాసోద్యోగమం దద్దటం
బాలోకించునె? యాత్మదృగ్విలసితాభ్యాసుండు కానన్, శివా!

449

కుసుమమ్మున్ గుసుమమ్ము గాఁగనిన సంకోచమ్మగున్ బుద్ధి; కా
కుసుమ మ్మమ్మయె, ప్రాణమే, యనిన వ్యాకోచమ్మగున్ బుద్ధి; కీ
విసువాసమ్మునె పున్నెమంద్రు; తొలి దే విఖ్యాతపాపమ్ము; నీ
వె సుమా యీతెనుయుగ్మరూపిణివి దేవీ! చిత్రలీలావతీ!

450

అదియే సార్థకదృష్టి, సర్వమును నీయాకారమే యంట; యు
న్నది నీవొక్కటె యొండు లేదనుటె; నీవాత్మాఖ్యతో నన్నిటన్
గుదిగొంటెన్నుటె; సర్వశక్తులును నీకు న్వేఱుకాదంటె; నే
నదియే యంట; మఱేమి యంటకును మృగ్యమ్ముల్ నుడుల్; శాంభవీ!

451

జననీసత్తయె సర్వసత్తయనుచున్ సంధాన మానాఁడె, నీ
ఘనచిత్తన్ గనఁగల్గి, యందు నిలుచున్ గష్టమ్ము లేదే; కన్పడే
నిను నానందమయిన్ స్పృశింపఁగలుగు న్నీబిడ్డఁడంతే కదా?
నను సచ్చిత్సుఖరూపిణీ! సయిపుమా నాపల్కు తప్పైనచోన్.

452

గొడవలఁజిక్కి యేడ్చు కొడుకుంగని పర్విడి వచ్చు వేళ, నీ
వడి వడ, జాఱు పైఁట యెఱవాఱిన యడ్గులు, తూలు ముంగురుల్
నిడు సెక యూర్పులున్ దెలయు నీజననీత్వ మెఱుంగు నాతఁడీ
గొడవలె మేలు సేసె ననుకొంచునె నవ్వును గాని, యేడ్చునే?

453

అక్షోభ్యంబగు మానసాసనము నీకర్పించి, ముచ్చట్లకై
యక్షమ్ము ల్ముకుళించునంత, కెవి నాకందిత్తువో నీవె; సూ
క్ష్మాక్షద్వారములం, దవే యివి; యటన్ శాంతక్షపాగర్భమే
సాక్షీభూతము; నీవదే కదవే; ఓసర్వాకృతీ! శాంభవీ!

454

సంచితదుష్టవైషయికసంస్కృతిసాంద్రవనమ్మునన్ భయ
మ్మించుక లేకయే తిరుగు నీ నరసింహామె, సాధనమ్ముఁగా
వించెడి వేళ, నడ్డయిన విఘ్నగజమ్ములఁగూల్చి, బిట్టు గ
ర్జించుట నీకృపాబలవిశేషము నొందుటఁగాదె? చండికా!

455

అమ్మవు నీవె నా ప్రకృతివంచుఁదమింగని, భక్తి సంస్థితయు
గమ్మునఁబూవుదోయిలి సమర్పణ చేసెడి సాధకుండె, ని
క్కమ్ముగ నీదు వాహనము కాఁదగు సింహము యాచు, నిక యు
చ్ఛమ్ముగ నిట్టు నట్టుఁ బరిచాలితఁ జేయఁగలండుః చండికా!

456

నడుము బిగింపుమమ్మ! యుదునాయకసత్కళ మాలిఁదాల్చి, చే
రడిదము నూని, శూలకరవై వెస రమ్ము; మృగాధినాథుఁ డే
కడఁ జనె? నేను వాహనము కాఁదగనే? యసుగాలివైశసం
బడలక చూతుఁ, దోడగుదు, నాహవభూమికి రమ్మ, చండికా!

457

అమ్మ! నరుండు నీదు ప్రళయంకరశక్తివిశేషబోధలా
భమ్మగు నాఁడె, మృత్యుభయవర్జితుఁడై విషయాస్మితామమ
త్వమ్ములఁ జిక్కకోఁ; డదె కదా రణభూమి విషణ్ణపార్థుపైఁ
జిమ్మితి కృష్ణరూపమునఁ జిక్కని నెయ్యము నాఁడు; కాళికా!

458

అమ్మవు నీవు, జీవులు త్వదాత్మజులైనపు, డింక నిష్ఠుర
త్వమ్మున కేది తా? వపు డభావరుజామరణాదులందపో
హమ్మున, నెగ్గులంచనిన వన్నియుఁదోఁచును, సత్వమాత నె
య్యమ్మున, నైన లగ్గులని, యన్నిట హాయినె జీవుఁడొందుఁగా.

459

అమ్మ! విశిష్టరూపమున నంతికమందున నిల్చి, వత్స! కా
మ్యమ్ముల నిత్తు నన్న, ధుతమాయుఁడనై, "పరిపూర్ణవీ, వఛా
వమ్ములతో వరమ్ముల కభావము యేర్పడె; నిల్వుమా సమ
తమ్మున" నంచు వాఁడనిమిషస్థితి నొందక యున్నె? శాంకరీ!

460

ఒక పతి యాత్మనిష్ఠనగు నుద్ధుర సౌఖ్యము నొందువాఁడు, దా
నికె మఱి వ్యాకులంపడును; నిచ్చలు నీయలవాటు గాటమై
యిఁక విషయోత్థతృష్ణ కెడమీయదు; వాఁడె యనన్యభక్తుఁడ
మ్మకుఁబ్రియపుత్త్రుఁడాతనికె మళ్ళని శాంతి నొసంగు దీవుమా!

461

నా తల్లీ! పరమాత్మ! నీప్రకృతి యెన్నండేఁ జడమ్మౌనటే?
చైతన్యాత్మకు భిన్నమై ప్రకృతికిన్ స్థాయిత్వ మెట్లుండు? సం
చీతత్త్వమ్ము స్ఫురించువాఁడు జడమంచేనాఁడుఁ బేర్కొఁడు; స
ర్వాతీతంబగు నీస్వరూపమున కభ్యర్ణమ్మునన్ నిల్వఁడే?

462

తనజీవత్వవధక్రియాఫలము సిద్ధంబైన యాసాధకున్
జన మగ్గించును సింహమం; చతని యజ్ఞమ్మే భవచ్ఛక్తి చా
లనయంత్రమ్మయి, కొన్ని నీవగు పనుల్ సాధించుటన్, సింహవా
హనవై యొప్పితివంచు నెంచెదను; తప్పా? చెప్పుమా, చండికా

463

రమణీయోచ్చహిమాద్రిశృంగమె సహస్రార; మ్మటన్ నిల్పి ని
న్నమలుల్ సాత్త్వికభావులై కొలువ బాష్పాసారముట్టున్; సమ
స్తమలక్షాళనదక్షవిష్ణుపదజాస్నానమ్మదే; వారి క
శ్రమలభ్యమ్మగు నిత్య మామరనదీస్నానమ్ము, సర్వేశ్వరీ!

464

నా నిరతాశ్రయాంబను బ్రణామసుహృష్ట నొనర్చినాఁడ; నా
హీనత దుల్లిపోవె, మఱి యొదు నభావము తోఁపదింక, నే
దీనుఁడ నెట్టులాదునని, ధీరత యేర్పడి జీవుఁడొందెడున్
మానసికోన్నతుల్ సకలమాత! ఫలమ్మిదె నీకు మ్రొక్కుటన్.

465

కారణభూతశక్తి యొక గమ్యము వైపొక సారి చేరఁగాఁ
గోరిన, గమ్యమెందువఱకున్ దలపోయకె సాగఁగంటి, వే
సారుడు; నీవదే యనెడి సత్యము తోఁచు; నదే పునస్తనూ
ధారణకారణమ్మనెదఁ, దప్పయినన్ క్షమియింపు మంబికా!

466

అణువునకంటె నీవణువ వన్న శ్రుతోక్తిని యున్న మానవుం
డణువును జీల్చి చీల్చి యొక యద్భుతమారణయంత్రకల్పనా
చణతకు నుబ్బునే? మనుజచాతురి మూలము నీవ యంచు, న
య్యణుగతశక్తి వీవ యను చందఁడె లజ్జను? హ్రీంపదార్చితా!

467

హృదయస్థుండగు నొక్కదేవుఁడెటు నన్ ప్రేరేచు నట్లేను జ
ల్పెదుఁగర్మమ్ముల నన్న తెల్వి యడరన్, లోపించి కర్తృత్వ, మా
హృదయస్థుండగు దేవునందె తగులంబెచ్చిల్లి, సర్వంబు నీ
యదె యంచచ్చఁడె యాత్మ సాధకుఁడు? ధన్యత్వంబదే; శాంభవీ!

468

అమ్మయె వస్తు; వన్యము సమస్త మవస్తువె యన్న గట్టి జ్ఞా
నమ్మె సహాయయష్టిగ నొనర్చి, నిమీలితదృష్టితోన, య
న్నెమ్మొక తోడు లేకరిగి, నీమణిమందిరమార్గమందు భ్రం
శమ్ములు లేకె సాధకుఁడు సాగి నినుం గనఁజాలు శాంభవీ!

469

అల కీటాణువు గోలె నీశ్వరుని పర్యంతమ్ము మాయమ్మయై
వెలయు న్నావున సర్వభావములతో, విశ్వాకృతీ! యంచుఁదో
ల్తొలుతన్ మ్రొక్కుట యభ్యసించని సుతుల్ దూరస్థులై త్వద్దయా
కలితాలోకసుధాకణాప్లుతతనుల్ కానేర్తురే? శాంభవీ!

470

అంబా! స్నేహసుశీతలాంకమును, భావాతీత! త్రైగుణ్యశూ
న్యంబౌ నీయురమున్, సుధామయము నీయంఘ్రిన్ సుతుండొక్క తో
చుంబె చేరినచో జగద్భ్రమము మాయమ్మే, జగజ్జీవభా
వంబున్నే? మఱి నేననంచు నొక భావమ్మున్నె? భావాత్మికా!

471

అమ్మా! సాధనమూలవిత్తమగు మాత్రాస్తిక్యబోధమ్మె, పు
ణ్యమ్మున్ంబట్టి, యెవండ దెంత యధికమ్మార్జించునో, యంత లా
భమ్మొందున్; ప్రతిఘాతసంశయములున్ బాధింప; వీసత్యబో
ధమ్మె జీవుని సాధకాగ్రియునిగా ధన్యాత్ముగాఁ జేయదే?

472

సుతు సుతుండంచునే యెలమిఁ జూపఁగఁ గార్యముచే విశిష్టసం
స్కృతి యటఁ బ్రేమరూపమున సిద్ధముగున్; సుతు లేమి కల్గఁ బ్ర
స్తుతమగు వేదనమ్మొకటి తోఁచును; దానికి లేమియుండ దా
స్థితియె యఖండహార్దజలధిన్ నరు ముంచెడి హేతువౌ సుమా!

473

సతిసుతులన్ భరింతును నిజమ్ముగ వారల తృప్తికే; జగ
ద్ధితకృతులన్ జగమ్ముఁ దనియించుటకే యొనరింతు, నన్న వాఁ
డతితర మోహపంకిలుఁడె; యంతయుఁ జేయుదు నాత్మతృప్తి క
న్న తెలివి కల్గనంతకు సనాతనివౌ నినుఁగాన లేఁడుమా!

474

గురుమూర్తిం గని, యమ్మ నా యెడకు సాగూ దాత్రియై, యామనో
హరరూపమ్మున వచ్చె, నాహృదయరాజ్యమ్ములు సామ్రాజ్ఞియున్
జిరమిత్రమ్మును, సర్వభూతములలోఁ జెన్నారు విజ్ఞానసుం
దరి యంచుం బ్రణమిల్లు సాధకునకున్ దవ్వుండ లేదంబికా!

475

చూపులు రెండు లీనమగు చోటనె సాధకమానసమ్ము ని
శ్చలత నొంది లీనమగు; లీనవిలోకమనస్కుఁ డనందుఁడా
నాపకె యాఁగు మాగుత; మిదంతయు నాత్మసమర్పణమ్ముతో
నౌ పని కాదె? నీదు కరుణార్ద్రితతోడి దదెల్ల శాంభవీ!

476

అగదము నాను వేళ, ప్రణీతంబగు నంగము శస్త్రవైద్యహ
స్తగతము సేయు వేళఁ దొలుతన్ వెగటొందిన, నందసామ్యమా
సుగముగ నీవె యుంట, వెనుసూపక తత్ప్రతికర్మలొందఁగా
నగుచును బాధ్యులాదురు జనమ్ములు; నిత్యసుఖస్వరూపిణీ!

477

అమ్మనుఁ జూచినంతనె ప్రయత్నము లేకె సమాధి వచ్చు నం
చిమ్ముడిమాట కొందఱకె నిందమిచే, యమముఖ్యకష్టమా
ర్గమ్ముల నూనుకొందు; అది కాదు; సమాధినిఁ బట్టి వచ్చు నం
గమ్ములు; బిడ్డలార! యని గట్టిగ నీవె వచింపు మంబికా!

478

దేవాంగమ్మగు నీజగద్రచనముఁ దెల్పంగ దృష్టాంతమై
శ్రీవిద్యాది నవశ్యభార్యమయి, సుశ్రేయోదమై, జ్ఞానదం
బౌ వాసోరచనమ్ము సేయఁగల పుణ్యాత్ముండు, సర్వేశి! ఈ
శావాస్యోపనిషద్రహస్యవిదుఁడౌ నచ్చంపు దేవాంగుఁడౌ.

479

అవచోమానసగోచరంబయిన యాత్మాభాస మైనప్పుడే
యవబోధాఖ్యశరమ్ము సేయు, గుఱిగా నయ్యాత్మనే చేసి; కే
శవుఁడీ సాధననే మహావ్రతముగా, సంసిద్ధిమూలమ్ముగాఁ
బ్రవచించెన్ దుది చేతగా, జనని! యాపార్థాఖ్యజీవాత్మకున్.

480

'రూపందేహి'యటంచు స్థూలమగు రూపమ్మున్, సత్యప్రతి
ష్ఠాపద్యం జనుదేని, యెంత యగునో సౌలభ్యమో బిడ్డ! రూ
పాపోరాశిని మున్గు, టాపయిని రూపాతీతరూపాబ్ధిపైఁ
జూపుల్వ్రాలుట, నీవె చూడఁగలవంచున్ దెల్పు మీవే, శివా!

481

ధనరూపమ్మగు నీదువిక్రమము ప్రత్యక్షమ్ముగా బాహ్యజీ
వనపూర్ణత్వవిధాయి యైన, సకలవ్యాపారజాలమ్మునం
దున నాదే యను భావ మాసురము, నందున్నది కాదమ్మదే
యనుటే దివ్యము; నీవు మెత్తువు ద్వితీయమ్మైన భావమ్మనే.

482

ఇచ్చుట కీవు మెచ్చఁదగు నేదియు లేమిని జేసి నన్నె నీ
కిచ్చెద; పాపదోషముల నేసరు నాకిది యేల నాక, చో
టిచ్చెదొ నీకృపాద్యుతి రహించు కరాంతరధామమందు; లే
కెచ్చటు చూపెదో, జననియే గతి నాకను బిడ్డ కంబికా!

483

అతని మనస్సె శాన్తిమయ, మన్నిట నెవ్వఁడు నిన్నె కానఁగా
జతనము చేసి కన్గొనుచు సర్వమునందును ద్వన్మయత్వని
శ్చితమతినుండు; నాసుజనశేఖరు వీడఁగఁజాల వీవు, ని
న్నతఁడును వీడలేఁడెఱుఁగనా; తుదకైక్యమె తత్ఫల, మ్మమా!

484

అపరా! పారము లేని దైశ్వరము సత్యంబౌచు, నీదేశకా
లపదార్థాత్మకమైన జాగతము లెల్లన్ స్వీయమౌ చిత్రమౌ
వపువై యొప్పెడి'నాద'పేరి కళనే భావింత్రు యోగీశులం
ద్రు; పరాంబా! యటు వెన్న నీవె కనుగొండున్నేఁడు చూపెట్టవే!

485

తల్లి! అశ్రుశరీర; వానిని నహంకారశూన్యమౌ చూపు కో
ఖిల్లంగోల్వ్యా, నిదంతయుఁ సమసిపో, భిన్నత్వముఁ జచ్చి; వాఁ
డెల్లప్పు న్నిను నెల్లెడం గనుచుఁదా నే నీవుగా మారుచ్, శ
రోత్సల్లోలోర్మలఁ దోఁగి నాదమయుఁడై యొప్పారఁడే? త్ర్యక్షరీ!

486

ఆదివటుకుంట చేసె సతి వైదికి, కావున నాదిశక్తి వీ;
వెద సిను నెంచికొంచుఁ బరమేశుఁడు సృష్టి యొనర్చు నన్నచో
మొదలెవరన్న సందియము పుట్టును; కారము శబ్దశక్తిపై
వదలక, మీకభేదమును బ్రానుడి నమ్మినఁ జిక్కు లేదుమా!

487

ఆసకలాంబకే విడుతు నన్నియుఁ, బ్రేముడి నామె పెట్టు నా
గ్రాసమె సార్థమై యనుచు; కర్మఫలమ్ములఁ గోరనంచు, వి
శ్వాసముతో నుపాసనము సల్పెడి వాఁడె యథార్థమైన స
న్న్యాసి; అతండె మళ్లి యొక యమ్మకుఁ బుట్టఁడు ధీరపూజితా!

488

నందజు బ్రోల గోపిక లనందగిరో, తలి చెంత నగ్నులై
నందకులైన కందువు లనందగిరో, యరవాయిఁ గొంకలో
నందక సంచరించి జగదంబయె దిక్కని వీడకుండి ని
ర్మందతఁ గొల్చు వారల సమాయలు గాఁగని కాతు వంబికా!

489

దినకాలమ్మును జాలదంచు నెనుక దీక్షన్ సమర్పించు భ
క్తునకు న్దవ్వ జగమ్ము, నీవు పొడగుక; దుచ్ఛక్రియాలోలదు
ర్జని కాకాలము దీర్ఘ, మీజగము చేర్వక; నీవు దవ్విద్ది నీ
చనువే సాజమటంచు భక్తుఁ డెఱుఁగుక, సర్వాంబ! భక్తప్రియా

490

♦ ఆలను జూచి, భూజముల నారసి, యేఱుల నెంచి, పద్మినీ
పాలునిఁగాంచి, కల్వచెలి వైపయి కన్గొని, మాఱుమేలునన్
దాఖను వీడి యెల్లరను దన్పుఁదు, నాకృప నొందఁగా నదే
చాలని చూపి చెప్పెదవు సజ్జనపాఠము లెన్నొ మా, కుమా !

491

♦ ఎప్పుడు నేను–నాది యను నీరిక బుద్ధిని వీడి, లాతికిన్
దప్పక మేలుచేయుటె వ్రతమ్ముగ మన్గడ పుచ్చు మానవుం,
డప్పుడ యొప్పి నిర్విషయమై మది యంటదు దేని; నప్పుడే
చెప్పఁగవచ్చు నీదరిని జేరఁగ నర్హుఁడటంచు నీశ్వరీ !

492

♦ భూతవ్రాతదయాపరోపకృతులే ముమ్మాటికి న్నిష్కృపం
జేతం బెట్టెడి యజ్ఞమంచు సతము న్జింతించు వాఁడుం బలెన్
శ్రౌతస్మార్తవిధాకలాపములఁ గ్లిష్టభ్రష్టుఁడౌ వాఁడెటుల్
నాతల్లీ! దరిఁజేరు ? సంసృతిజసన్తాపాగ్నికే మ్రొగ్గుచున్.

493

♦ ఎరియుచుఁదానె, తీవ్రమగు నెండకు శీర్షము నొగ్గుచుండి, తన్
దరిసిన వారి నీడనిడి తన్పెడి భూరుహమట్లు, నన్ను ని
ద్ధర మననిమ్ము; నిన్గొలుచు దాసుఁడనైన ఫలమ్ము గాఁగ; భూ
ధరతనయా! పరోపకృతిధన్యత, చేరువ దారి నిన్గనన్.

494

♦ ఎవఁడు పరోపకారములనే యొనరించుచు, భక్తి మీఱి ధ్యా
నవశగ నిన్నుఁ జేయ జతనంబును జల్పునొ, వాఁడె వేదశా
స్త్రవిషయతత్త్వవేత్త, సుఖసంపద కర్హుఁడు; కాని నాఁడు, కా
శివలెఁ జిరాయువై బ్రతుకు క్రించనఁ జెల్లదె ? తల్లి! నిబ్బగా.

495

♦ మేయము మర్త్యమానస; పమేయవు నీ; విటులుండ నిగ్గన౯
జేయు ప్రయత్న మెల్లఁ దఱి చేటునకే యయి, జేనతోడ న
భ్రాయతఁ గొల్చునట్లగు; ప్రయత్నము లుండఁగ నిముక్త్ర; "నీవు నే
నే" యను తెల్వి జాఱనటు తేలినఁ జాలును, ద్వైతవర్జితా!

496

♦ మమకారమ్మె శరీరహేతువను నమ్మాన్యోక్తి నేనమ్మిన౯
"మమ మాతః! పరధామదే! సకలసంపద్ధాత్రి!" యంచుం బ్రమో
దముతోఁ గొల్చెడి మాకు భీకరమె యాఁదద్వాక్యః మేనింక నీ
మమతన్వీడి యభేదమే మనకు నమ్మా! యంచు మోదించెద౯.

497

♦ తనుపాత్రమ్మను ధ్యానశక్తిశుచితప్తమ్మనటుల్ చేసి, లో
మనసే యన్న జలమ్ముతోఁ గలియు కర్మఖ్యాతబీజమ్ములా
సెనగల్ పక్వము చేయకున్న, మొలవ౯ సిద్ధమ్ములౌ మళ్లి; ఈ
ఘనపాకక్రియ నేర్వనట్టినికి మోక్షమ్మున్నదే? ముక్తిదా!

498

ఘనమో యల్పమొ తాను జేయు పని నిష్కామంబుగాఁ జేసి త్వ
ద్వనజాతాంఘ్రుల కప్పగించు నతఁడే ధన్యాత్ముఁ డన్నింట నీ
యునికిం గాంచెడి వాఁడె సాధువు; తపస్యాద్యోగమం దీవియు౯
గనుగోల్మన్నగు నేవి లేనతఁడె నీ గారాము బిడ్డండుమా!

499

♦ అంతయు నీవె యంచును బ్రయత్నము మానుట తామసార్పణ
మ్మింత ఫలమ్ము లేనిది కదే; భవదాజ్ఞలు మీఱకుండ ని
శ్చింతత నిన్నుఁ గొల్వఁదగు; చేయుడు దప్పదె జాఱకుండ; అ
డ్డింతయుఁ బెట్ట కీదుతల నిడ్డ ప్రదీపము నాఱిపోవదే.

500

నినుఁదప్పించి మఱొక్కవస్తు వెదియు న్లేదన్నచోఁ బ్రార్థన
మ్మును బ్రార్థ్యమ్మును నర్థి యొక్కటగుటే ముమ్మాఱు నిక్కమ్ము; గా
న నినున్ వేడను, చిత్రచిత్రమహిమోన్నద్ధమ్ము నీ సృష్టి న
ల్లను నీయాటదినుసుగా నడుపు లీలన్మెత్తు; లీలావతీ!

501

♦ అంతట నిన్నుఁగాంచు నతఁడన్యుల యాఁకటి కోర్వలేఁడు; గో
రంత లభించినంతఁగనకాచల మబ్బినయట్లు పొంగు; కొం
డంతలు వచ్చినన్ నగుచు నారయు ధీరత; నిట్టివెల్ల సి
ద్ధాంతితలక్షణమ్ములు గదా పరతత్త్వవిదాళి, కీశ్వరీ!

502

♦ కోరిక దేహకారణము; కోరిక లేని మనస్సె దేహముం
గోరదు; కోర్కి రూపఱుటకున్, వెలి లోపల నాటలాడు ని
న్నారసి 'నే నదే' యను యథార్థముఁ గైకొను నాఁడె, కోర్కితోఁ
దీఱును మేతగుల్; మఱొక తెన్నది తోఁచదు; మోక్షదాయినీ!

503

♦ నీ పదభక్తి పేరి తరుణీమణితో ననపాయిమై, హృషీ
కోపధి లేని జ్ఞానతనయు న్ననువాఁడె సపుత్త్రుఁ; డాసుతుం
డే పితృమోక్షకారి యను నిక్కువ చక్క నెఱుంగు సాధకుం
డే పడిపోఁడు; వానికె యొడిం దలమిత్తువు పిల్చి, ముక్తిదా!

504

♦ దినుసులు, వాని పన్నగడ తీరును, బిడ్డలమైన మాదు కా
మనకగుటే నిజంబగు; సమస్తమునందునఁదిండి నూపిరిన్
మునువున నిన్నె చూడక ప్రమాదముతోడిది భోగమైన, నా
తనయులటన్న ప్రేమ విడి, తాళము పట్టుదువీవె; చండికా!

505

♦ భవదాఖ్యాసుమమాలలోనిది 'శివా' ప్రఖ్యాతపుష్పంబె, యీ
భవదుగ్రాసన మాపునట్టిదని, శశ్వచ్ఛిరస్ధార్యమ్ముఁ జే
యు విశేషజ్ఞుఁ డిహమ్మునందు శివధుర్యుండై శివాకారుఁడై
శివసాయుజ్యమునొంది రాఁడు భువికిన్, శ్రీరాజరాజేశ్వరీ!

506

♦ ఆతఁడలజ్జుఁడంటకు నఘాత్ముఁడు దైవకృపాసుదూరుఁడం
చే తగు నర్థమౌను; జగదీశ్వరి! వాఁడు సలజ్జుఁడంటకున్
పాతకి కాఁడు, నీకృపకుఁ బాత్రుఁడు, నాఁదగుఁగాన నే, నిన్నున్
భూతములందు లజ్జవయి పొల్చెద వందురు పండితోత్తముల్.

507

♦ కనుగొన ముట్ట నేవయగు కంబళిపుర్వు, స్వరూపసంస్మృతిం
గొని, యొక గూడు పన్ని యటఁగొన్ని దినాలు నిను న్జపించి దా
గినఁగనుపండునౌ భ్రమరకీటమగా, మఱి మార్చు నీకృపన్
జనుఁడు గణించి నిన్గొలువ సత్కృతుఁడౌటొక వింతయా? శివా!

508

♦ ధనరూపమ్మునఁగొందఱన్ సుతుల వాత్సల్యమ్ముతోఁ బ్రోతు, వై
నను వారల్సుఖులంచు నెంచ; నెవరి న్వాగ్రూపవై ప్రోతు, వా
ఘనులే నీకు నదూరులై, విమలులై, జ్ఞానప్రదానాఢ్యులై
నిను సేవించుచు సార్వభౌమపదవిన్ గ్రేణింత్రు; రాజేశ్వరీ!

509

♦ నీపరశక్తి లోనలరి నిర్మలుఁడౌ తఱి సాధకుండు తా
లోపము చేయఁడే నతనిలో వెలుఁగొందుదు వొక్కతీరుగా;
దీపము గాజుకుప్పియను దేజరిలం బొగపోవు దారి తా
నాపిన దీపమాఱి తమమందు మునింగి కలంగఁడే, శివా!

510

♦ కనుఁగొన రాని స్వర్గనరకమ్ములఁగూర్చిన రిత్తచింతతో
మనుగడ పుచ్చ లేక, పరమంబగు శక్తికి లోఁగె నీజగ
త్తని, కన నద్ది నీవె యని, యర్చన చేయుటె స్వర్గ; మాడెసఁ
గన కురకుంటె ఘోరనరకమ్మని యెంచి భజింతు, శాంభవీ!

511

♦ జననీ! నీ గరిమమ్ము నెన్నిన మనఃసంకోచభావమ్ము తీ
ఱును; గర్వోన్నతి బత్తిసడ్డలుగ మాఱుం; జిన్న చూపెందునుం
గన; దీ యైహికతుచ్ఛరూపరసగంధప్రీతి మాలుం దనం
తన; నీవే మిగు లాదటే మిగులు కాదా; తల్లి! నీబిడ్డకుం.

512

♦ తలుపులు బిగ్గ మూసికొని, తల్పమున న్గదిలోఁబడున్నచో
వెలుఁగును గాలి లేమిఁదనివిం గొన వీలగు? అట్లె నీదు సే
వల సడిసన్న చేసెడి యభాగ్యశిఖామణి భుక్తిముక్తులం
బొలయఁగలాఁడె? జ్ఞానసుఖభూతికి దూరుఁడు కాఁడె? శ్రీకరీ!

513

చేరునె వానకోయిలలు చెర్వుల నేఱుల? దప్పిగొన్న నా
నీరముఁ గ్రోలునే? వలచు నీరదనీరకణమ్ము; లట్టులే
సారభవత్కృపాగుణరసమ్ము నెఱింగిన మాతృదేవుఁడౌ
ధీరుఁడు నిన్నె చేరఁగను దేశముఁగాలముఁ జూచి; అంబికా!

514

♦ 'ఉమ'యన శాక్తమా ప్రణవ; మోంకృతిమాత్రలు మూఁడు దానిలో
నమరఁగఁ దారకప్రణవ మంచును బెద్దలమాట; యీరహ
స్యము కమలాదిశక్తినిచయాత్మను నిన్ భజియించు భక్తస
ఙ్ఘమునకె తెల్ల; మన్యుల మనమ్ముల కెక్కునె? ఓంపదాకృతీ!

515

♦ ధనిభవనంబు డంబుఁగని తన్విఁ గొనంగనె జోగి తుత్తు మా యునె? తన క్రిందిపిల్పునకు, 'ఓ'యని యాధని పాపమిద్ది యా ర్తునినదమంచు వచ్చినఁగదా; అటె సాధకుఁడు స్మహార్తితో నినుఁగరఁగించు నాఁడె జననీ! దయఁజూతువు, పాతువంగదల్.

516

♦ ఆయపుఁబన్ను పైఁబడు భయమ్మునఁబెట్టుబడిన్ గొఅంత తాఁ జేయఁగ లాభమందుఁగొఅ చెందఁడె కోమటి? యట్లె త్వత్కృప దాయినయత్నమందుఁగొఅఁతంబడు సాధకు సిద్ధి గొత్తితోఁ కే యయిపోయి, పోదతనికి స్భవబంధము, బంధమోచనీ!

517

♦ ధనము గడించు శక్తి ధనదా! భవదర్పణ మాచరించినన్ ధనగకళంక మంటదు; ధనవ్యయవేళను సందియమ్మును స్మనముఁజంచలత్వముఁగనంబడెనే నది, జీవి లోపబం ధనములకౌచు, నెన్నఁడుఁదుదంగన వాతని బంధజాలముల్.

518

అరిగి శివాలయమ్మునకు నందుఁగనంబడు బోడి రాతిఁ, బెన్ దిఱుగటి దిమ్మఁబోలి యది నిల్చెడి పీఠము, బోడి రాత ము త్తిఱుగుల నున్న సీద్రమును, దెల్విడిఁగాంచిన, శక్తిశక్తిమ త్పరమరహస్యబోధమయి, ధన్యత నొందు జనుండు; శాంకరీ!

519

ఈ మా దర్శన మాధిభౌతికముగానే సాగు నన్నాళ్లు, దే వీ! మాకెన్నఁడు బుద్ధియోగమను నావిత్తమ్ము చేకూఱు? న మ్మా! మా దర్శన మెన్నఁడేసరిలునో యాధ్యాత్మికమ్మౌచు, మా కామూర్తిన్మున మాత్మలాభపరధన్యత్వమ్ము; చిద్రూపిణీ!

520

అమ్మా! నీయుబు పాత్రందప్పెడి తీణాంబ దెల్లం బాపంబుంబు
న్యామ్మాక గ్లానియు సౌఖ్యదుఃఖములు మున్నా వాని, నీచింత-ధ
ర్మమ్ములన్నాని నివేదనమ్ము చలుపక, దద్భక్తునందేదో గు
ప్తమ్మా శక్తివికాస మొంది యతనిక బారమ్మం జేర్పంగదే,

521

నినుంగొనియాడు నాస్యమును, నీకె యెఱంగు శిరమ్ము, నీదు ప
ద్యనజసమర్పితంబయిన ప్రాణము, నీకిడు మంత్రపుష్పమా
మనసును, నిర్మలాత్మయును, మర్త్యులకెల్లర కబ్బునే? తపో
ఘనధనశాలియా సుకృతగంధికె యబ్బునుగాని, శాంభవీ!

522

'నేనే యిచ్చెద బుద్ధియోగ'మనుచుక శ్రీకృష్ణరూపమ్ములో
నానాఁడన్నది చెల్లినంత విడు బ్రహ్మగ్రంథి; జీవుండు తా
నానాఁడంతరుపాధుల న్మనింగి, నే నాయైదు కోశమ్ములుక
గానే, వానికిఁబై నిఁబోల్తునని యానందింపఁడే? శాంభవీ!

523

జననీ! యెల్లెడ జాగతంబగు సమస్తంబందు సత్యప్రతి
ష్ఠను జేయంగలవాడెపో గురువుగా సర్వమ్ము భావించి, "స
న్నను శాసింపుము శ్రీగురూ! ననుఁబ్రపన్నుక దల్లి"యంచేడ్చి యీ
మనుజత్వమ్మను గొందినుండి విడిపో మార్గమ్ముం జూచుక శివా!

524

తొలి మెట్టైనది సత్ప్రతిష్ఠ; యటఁగాల్ తోరమ్ముగా నిల్పినక
మలిమెట్టై తగు చిత్ప్రతిష్ఠను బదన్యాసం బనాయస్తమై,
నలువౌ మూడవ మెట్టు నా వెలయు నానందప్రతిష్ఠక సుని
శ్చలుఁడౌ జీవుఁడు; నిత్యముక్తదశ యీ సౌభాగ్యమే; శాంభవీ!

## 525

కోరక నీవు కన్పడవు; కోరిన యంత సుస్వరూపవై
చేరుదు; సాధకుండవు డశేషముగాందన సర్వముల్ గురు
శ్రీరమణీయపాదముల చెంతనుంబెట్టి, గురుండె తానుగా
మారును; నేనె కర్త నను మాట తొలంగుంగ్రమమ్ముగా, నుమా

## 526

నినుంగను నిచ్ఛతో-గురుండు నీవను బుద్ధి, గురుండు నేనెయై
చనుటయు, వాని యంఘ్రులకె సర్వము నిచ్చుట, కర్త నేను గా
వనెడి నిరూఢి, శ్రీగురుండు నాత్మయు నొక్కటె యున్న నిశ్చయం
బనునవె మెట్లు, నీ కరుణహర్మ్యము నెక్కెడి వేళ; శ్రీగురూ!

## 527

గురుం డాధ్యాత్మికశక్తి, మంత్రమును నిక్కాటమ్ము దెంతో పర
స్పరసంబంధియు, నేకమంట యనిరస్కార్యంబటంచున్, మహే
శ్వరభావమ్మునె యీత్రయంబనెడి విశ్వాసమ్ముతో సాధకుం
డురువేగమ్మున సాధనాగ్రియుండుగా నొప్పారండే? శాంభవీ!

## 528

అమ్మా! సర్వమునందు నిన్నుంగను నభ్యాసమ్ము లేనట్టి ప్రా
జ్ఞమన్యుల్ నినుం బార్థివాభ్యుదయవేషన్ గాని మన్నించి, క
ష్టమ్ముల్ కుడ్చుచు నీయమర్షమయవర్త్మమ్మే కనుంగొంద్రు, సౌ
మ్యామ్మా నీదు ప్రసన్నమూర్తిం గనంగా నర్హత్వముంగాంతురే?

## 529

ఆ త్రైగుణ్యమె భోగలాలసముగా నాభావమే యాసురం;
బా త్రైగుణ్యమె మోక్షలాలసముగా నా దేవభావమ్ము; ఈ
నైశాంతాసుర దేవయుద్ధమున కంత్యమ్మైన నాండే గుణా
తీతుండై యపవర్గబంధముల భ్రాంతిన్ జీవుండొందం, డుమా!

530

కన నధికమ్ము చేష్టయుఁ, బ్రకాశమలంతియు నైన, దుఃఖసం
జ్ఞనలరు; చేష్ట యల్ప, మదనమ్ము ప్రకాశము నైనచో సుఖ
మ్మనఁబడు; ఆసుఖమ్ము నెఱి యద్దు తమమ్మధికమ్మెయైనచోఁ
దనరును మోహసంజ; నిది తప్పయినన్ సరిదిద్దు, శాంభవీ!

531

ధనధాన్యాదికలక్ష్మివీ, వదె యసద్భావమ్మదే రాత్రి; చి
ద్ఘనతేజోమయలక్ష్మివీ; వదియె సద్భావమ్మదే చెప్ప నొ
ప్పునహస్సంచు; నసత్తునే కనెడి జీవుండే దివాంధమ్ము, వా
సినె ప్రేమింపఁగ ఘూకవాహనవుఁగా నిన్నెంత్రు, మోహాత్మికా!

532

నన్ను న్నెనెఱుఁగంగఁజేసెడి ప్రయత్నాల్ పెక్కులౌచున్న, నీ
కెన్నో నాళ్లెడమాట తప్ప; దపుడీవే వచ్చి, లో నిల్చి, "యీ
నిన్ను న్నన్నుఁగ నెన్నకున్న నిదునే నీద్వైతభావమ్ము? నా
కున్నా!"యంచును గన్ను విప్పినపుడే గోడల్తొలంగున్, శివా!

533

నీ యస్తిత్వము నమ్మి, మాపనులలో నీసన్నిధిన్ నమ్మినన్
మా యారంభములందు దిగ్గయద మీమార్గంబ దే యబ్బదే
మాయాగ్రంథిని విప్పకోఁదగిన సన్మార్గంబు లే; దందు దీ
రాయాసమ్మొకటె సశేషమగు మాకంతే కదా; శాంభవీ!

534

తన బ్రహ్మమ్మును నీకొసంగఁగల విద్వద్వర్యుఁడౌ వానికే
వెనుముందుల్గనకీవు నీవరునె యర్పింతంచు, గాయత్రి వం
చు నిషేవించి సుసిద్ధినొందిన మహర్షుల్ ప్రేమతో మాకుఁజూ
పిన దారిం జనఁగల్గు విప్రవరు లన్వేష్యుల్గదా; నేఁడుమా!

535

ఉన్నదటే యసత్తనుచు నొక్కఁ? దఖండమునన్ బహుత్వలీ
లోన్నతి రేఁగునప్పు డదె యొప్పె నసత్తని; సవ్విరోధిగా
నెన్నక యానఁటర్థమున కీవదటన్నను జిక్కు లేదు; నన్
నిన్ను నెఱుంగ నౌననుచు నీవె వచింపుము బిడ్డ, కంబికా!

536

భావమె నామరూపములు; భావమె నీరవమైన శబ్ద; మా
భావము లూఁడుటన్ మనసు వాఁగుచు నుండును దిక్కపోలికన్
రేవగ; లాత్మబోధము ఘనీకృతమైనపుడే, సశబ్దభా
వావళి యాఁటిపోయి స్థిరమౌ నొక సత్తను నిల్చు; శాంభవీ!

537

భావముతోడిదే చుమీ యుపాసనమాటను, దొల్త నీ జగ
ద్భావము లెల్ల నేనె, యను భావముతో రసికుండవైనచో
భావుకతన్ గడించుకొని, భావము మీఁటిన నాస్వరూపమం
దీవు చొఱంగఁజాలుదని, యీవె తెనూఁజుస కన్నమ్మ, శాంభవీ!

538

ఏకవు నద్వితీయవును నీశ్వరివౌ నిను నొంద, నేను నే
కాకినె కావలెన్; గహనకాననమందు వసింప నౌదు నే?
నీకును నాకు భేదమని నిన్నని, నన్మఱవంగ నౌదు నే
కాకినె; యప్పు డేకతనుఁగన్గొను సాక్షి యెవండొ? శాంభవీ!

539

అమ్మా! నిర్మలబుద్ధితత్త్వమది ప్రజ్ఞాఖ్యంబగున్; దత్ప్రకా
శమ్మా నాఁడె భవత్స్వరూప మెఱుఁగన్ శక్తుండు జీవుం; డభా
వమ్ముల్ భీతులు తోఁప వప్డు; తది లుప్తంబైన యానాఁడె, సూ
త్నమ్మా లేములు ధావనమ్ము లతనిని దావమ్ములై కాల్పవే?

540

పరమానందమయాత్మసత్తయెడ విశ్వాసంబు హేమాద్రిసు
స్థిరతం బొందినచో, హృషీకసుఖముల్ చేదై, బహుత్వంబునన్
విరసంబై, తొలి శత్రువైన మనసే నీయంకముం జేర్పఁగా
వెరవుం జూపెడి మిత్రుఁడై నిలువదే? విద్యా! మనోరూపిణీ!

541

జననీ! శ్రద్ధయు భక్తియుం దొలఁగు శుష్కస్వాంతవప్రంబు, నీ
యనుకంపాసుకదీర్ఘికావిరతకల్యార్ద్రంబు గాకున్న, ని
ర్ధనమై పోయి, హతాశమై చెడి, పునర్ధన్యంబు కానోపునే?
నిను గుర్తింపని వారి దుర్గతులివే నిక్కంబు; రాజేశ్వరీ!

542

అమ్మా! చిన్మయి! నన్ను నే నెఱుఁగనం చారాం! యాత్మస్వరూ
పమ్ముం గన్గొన స్వేచ్ఛ నుల్కడదు నా భావమ్మె, యా చంచల
త్వమ్మే, యెన్న రజోగుణమ్మనుచు నిర్ధారించి; రా బుద్ధియో
గ మ్మార్యర్షుల కెవ్వరిచ్చిరని టంకారమ్ముగున్; శాంభవీ!

543

ప్రాణమ్మే హరి యంచుఁ బల్కె శ్రుతి; యా వాక్యమ్మునే నమ్మి, స్వ
ప్రాణమ్మున్ హరి పేరి ప్రాణమునఁ జేర్పన్ లేని జీవుండు, ని
ష్ప్రాణుండే యయి, శ్రీహరీ! యనుచు మిన్ వ్రయ్యంగ ఘోషించినన్
బ్రాణమ్మందుఁ బ్రతిష్ఠ కల్గ; దమరత్వమ్మబ్బునే? హ్రీమతీ!

544

నిను గుర్తించితి భావరాశిమయి! నానేనా! వడిన్ రావె, నా
జననీ! వేగమ రావె రూపమయి! శీఘ్రాత్మికా! వచ్చితే?
యని సర్వస్వము నాత్మఁగాఁగనెడి ధన్యాత్మున్ సమీపించి, నా
శనమున్ దాపమయి కోరికొందు రసుకుల్ సర్వేశి! సర్వాత్మికా!

545

గడుసరి భావరాశి యుబుకన్ గని, రూపమయీ! యటే కడున్
వడి నటుదెమ్ము శబ్దమయి! స్పర్శమయీ! వెస రమ్ము; మాఱుమో
మిడః కనుచిట్లు భావతతి నెల్లను నిన్నుఁగఁ జూచువాఁడు, లోఁ
బడక జయింపఁడే యసురభావములన్ శ్రమ లేక? శాంభవీ!

546

చెడు కలఁగాంచు వేళ, సనుఁ జింతన చేసెడి వేదమంత్రమం
దడుగున నున్న నీదు పరమార్థ మెఱింగిన వాఁడు, దానినే
విడక యహర్నిశల్ నెమరు వేయుచు, గోతనుఁడైన నందికే
శుఁడువలెఁ దల్లి! నిన్ను గిరిశున్ వహియించుచు, గట్టు చేరఁడే?

547

అమ్మా! నీదగు స్థూలదేహమె జగత్తం చెన్ని, యద్దానినే
యమ్మంగాఁగన లేని వాఁడెటులు లోకాతీతమా సూక్ష్మరూ
పమ్మున్ గేవలశుద్ధచిన్మయసురూపమ్ముంగనంజాలు? వ్య
ర్థమ్మై యాతని సాధనల్, తుదకు జింతంగూరఁడే? శాంభవీ!

548

మైతో నిల్చి యవిద్య మాపఁగల సామర్థ్యంబుతో సానుకం
పాలుత్వమున నొప్పు సూక్ష్మ మొకటే వంద్యంబనన్ జెల్లునా?
సాలగ్రామము నుంచు పీఁటయునుఁ బూజ్యంబైనటుల్ శ్రీగురు
స్థూలమ్ముం బరిపూజ్యమం చెఱుఁగు శిష్యుండే ఘనుండంబికా!

549

మమతాపంకిలవేషమా! శుభము; కామాకల్పమా! రమ్ము; స్వ
ర్ణమయాకారమ! స్వాగతమ్మనుచు, సర్వమ్మమ్మయే యంచు, ని
న్నమలాత్మన్ గుఱిచించి మ్రొక్కినపు డమ్మా! మల్లి క్షుద్రత్వరూ
పముతో రా మొగమోడకుందె? యిదె విశ్వాసమ్ము, రాజేశ్వరీ!

550

♦ నేనను వస్తువున్నదను నిక్కపుఁదెల్వి రవంత విస్మృత
మ్మైననె, మృత్యువన్నను భయంపడు మర్త్యుఁడు; నేను మర్త్యుఁడన్
గానను తెల్వియే నిలువఁగా, నది నీవె యటన్న తెల్వి లో
లోన నెసంగునప్పుడె, విలుప్తభయుండగు, నాత్మరూపిణీ!

551

♦ పతి తన తృప్తికే సతిని, పత్నియు నట్లె పతిన్, గుమారుఁడుల్
బితయుఁబరస్పరంబెలమిఁబెంచుట యాత్మను దన్పుటే, యటం
చతికిన తెల్వి లోనమను నాతఁడె, సత్యమునందు సుప్రతి
ష్ఠితుఁడయి చిత్సుఖాత్మకవిశిష్టపదంబునుఁజేరు; శాంభవీ!

552

సారజ్ఞానులు సర్వశక్తిమయి మా సర్వాంబయే, యిట్లు సం
సారాకారముతోడ నిత్యమును ముస్తాబౌచు మోహాఖ్యదు
ర్వారావర్తములోన జీవుఁడను పేరన్ దూఁకునం చచ్చమా
దారిందప్పరు, గాన వారలకు బంధంబుండునే? శాంభవీ!

553

ఏకాలమ్మున నుండియో తనయ! మేనే చుట్టమై పోయె; నీ
నీకు న్నాకగు నిత్యబాంధవమునే నిక్కమ్ముగా నెన్నితే
నేకాకిత్వము మానమున్ గొజతనమింకెే లేక నీకబ్బు, భా
షాకార్యంబటె, శాన్తిగల్గు ననుచున్ సాయింపు మీవే; శివా!

554

ఆనాఁడీవు కిరీటికూఁదిన రహస్యంబిద్దియే, శ్రీగురు
స్థానంబందున నిల్చి; వైషయికతృష్ణల్ వీడి నీరాగుఁడై
యేనేనై పరశాంతియుక్తుఁడయి యుంగేఁ యాత్మసంధానమా
నీ నీపాఠము నాటి తేలుటది మా కేనాఁడగున్? శాంభవీ!

555

♦ అపగతతంద్రుఁడై శ్రితుఁడనావిలభక్తిని గొల్చి నీదు గా
థ పరిచయమ్ము నొంద, నొక దంబగు శక్తియె దారి చూపుటన్
గృపమెయి వాని కార్యములు నీవె యొనర్చుటయుం గ్రహించి, పు
ణ్యపరిణతిన్ సమస్తము మదంబదె యంచుఁ దరించు; నీశ్వరీ!

556

♦ తడి గల చల్లగాలి నరు దప్పిని దీర్పదు గాని, నీరము
న్నడకె నిగాను లాగునటు, లీడ్యగురూత్తమబోధతోడ నీ
కడకను చూడ్కి చేర, నొకకష్టమె నిన్ను భజించి కాంచి, నీ
యడుగులయందు మున్గి భవయాతన లేక సుఖించుటంబికా!

557

♦ 'ఉన్నది యొక్క నేనె' యనుచుండును గృష్ణుఁడు గీతలం; దశే
యున్నది యొక్క నేనె యనుచుందువు నీవు; ననంతశబ్దసం
పన్నత నెక్కువే యనెడి మాట నెఱింగెడివారు, పూరుషుం
డన్నను నారి యన్న నెడ యంచుఁ దలంపక కొల్తు, రంబికా!

558

♦ పర మొదలైన నాలుగగు వాక్కులు నిక్కము నీవ యాచు వి
స్ఫురణము నొంద, స్తోతయును స్తుత్యమునుం స్తుతి యన్న భేదమే
పరఁగక, నీవొకర్తవె యుపాధియు జ్యోతియు నాదమైతి వం
చరసి నిరంతరమ్ము సుగమందెద సాంజలినై పరాంబికా!

559

♦ నమ్మిక మేడ యెక్కుటకు, నద్వడి మెట్లులు చూచి నీప్రసా
దమ్మునఁ దెల్విలోల కయిదండగఁ దాల్చిన నాఁడె మాకు సా
ధ్యమ్మగు; నీపదాబ్జములె ధ్యానము చేయుచు, వానియందు నే
మమ్ములఁ బెట్టికొన్నపుడె, మా చెయి యూఁతగ నిల్తు, వంబికా!

560

ఏమైమేము గడించుకోఁదగినదా యీజన్మరాహిత్య? మీ
పేమున్నొక్కపు డిచ్చగించితికదా యీసర్జనోల్లీల; య
ట్లేమై నెన్నఁడు దీని కారతిని నీవిచ్చింతో, యండాఁక, మా
బాముల్ సావులుఁ దప్పనంచెటులు విశ్వాసంబగున్? శాంభవీ!

561

♦ దీపము లేని వేశ్మమునఁదిర్గుట దుస్తర, మట్లె త్వత్కృపా
దీపము లేక యున్న జగతీతతి యెల్లను జీఁకటిల్లు కా
దే? పరశక్తి పేరి బలుదీపశిఖన్ నినుఁగొన్నవాఁడె, తా
నేపనినైనఁ జేయఁగలఁ; డియ్యది చాటును వేదవాక్కులున్.

562

♦ 'అవ-అవ' నాక, యర్చనరహస్య మెఱుంగక, నీపదాబ్జమం
దవసతి లేక, చేయు వివిధాచరణమ్ములు, సాహసించి నే
ల విడిచి చేయు సాములును, లాభము లేని వణిక్ప్రవృత్తులై
యవటములోన దించు చెడు నావటముల్గదె; చక్రవర్తినీ!

563

ప్రేమమె నీస్వరూపమఁట; ప్రేమమె నానిరపాయభక్తి; యీ
ప్రేమలు క్షీరశర్కరల రీతి నొకండయి, నవ్యమాధురీ
స్తోమము పుట్టుటన్నదియె చూ పరమైక్యత; దాని నొందుటే
కోమలభాష, 'ముక్తి' యను కోవిదవాక్యమె రూఢమంబికా!

564

♦ తలఁపటె యైక్యతన్ దనివి తార్కొను వేళ కృతంబు; సర్వవ
స్తుల నినె కాంచి యన్యమెది తోఁపని వేళయె త్రేత; నీదు పూ
జల నొనరించి నీకె యిడి సర్వముఁ గుక్కెడి వేళ ద్వాపరం;
బల కలియన్న నీస్మరణ మాగక చేయుట కాదె, కాళికా!

565

♦ తొలి దుష్కర్మఫలమ్ముకై కలఁచు నాదుఃఖమ్ములన్ నీదు దా
పలి చై నా తొలిపున్నెపున్ ఫలముగా భాసిల్లు కల్పద్రుమకో
మలశాఖంబలె నెంచికొంచు జగదంబా! ధీరతం బొల్చి బె
గ్గలముం జెందను; పాదభక్తజనరక్షాదక్షా! రాజేశ్వరీ!

566

♦ ఇంటను జిన్న దివ్వెయు నొకింతగ సందడి యున్న, దొంగ లే
వెంటను దూర లేరొ, యటు విశ్వజనిత్రిమహత్త్వబోధ నూ
ల్కొంటయు శుద్ధచింతలును గూడిన చిత్తగృహంబుఁ గల్మషం
బంటదటంచుఁ జిన్నటనె యార్యులు నీమనువిచ్చు టంబికా!

567

♦ తన యాత్మార్పణశక్తిఁ బట్టియును స్వార్థత్యాగముం బట్టి, భ
క్తునిలో నీశ్వరశక్తి పాఱ, నతఁ డొందు న్నవ్యమోదంబొగిన్;
గనిలో నేర్చిన ఱాయి శాణతలసంఘర్షమ్మునన్ బల్క ని
గ్గనయుం గాంచిన శిల్పిఁ బోలి, యదె తాయీ! నీకృపావీక్షయా.

568

♦ అమ్మా! శోధనకాఁగి, దార్ఢ్యయుతమై, యత్యంతసంతోషపూ
ర్ణమ్మానట్టి విధేయతాగరిమ స్వార్థచ్ఛాయ లేకుండి ని
త్యమ్ముం జూపెడి వాఁడె యాత్మనిడఁగా సర్వాండగున్, నీదు పా
దమ్ముం జేరును; కాని నాఁడతఁడు వ్యర్థప్రక్రియుండే కదా.

569

♦ అహమిక లేని శ్రద్ధగల యాత్మసమర్పణమున్న, నీ యను
గ్రహమును రక్షయుం గలుగు; కానియెడన్ భ్రమతోడి యాసయే
బహుగతి నొంచు; మెట్ల బిగి వాసిన నిచ్చెన నమ్మి యెక్కినన్
మహిఁబడి యంగభంగమయి, మన్గడ దుఃఖద మౌను శాంభవీ!

570

♦ శరణము నేను, త్యాగమును జల్పుమటంచును దండ్రి తెల్ప, నే
శరణము, భోగమూలముగఁజల్పుము త్యాగమటందు వీవు; మీ
స్మరణము రెండు బోధల సమానము, ముఖ్యము గాన, బోధలం
దిరవగు త్యాగభోగముల కేకతయే ఘటియిల్లు నంబికా!

571

♦ ఇరువది నాల్గు తత్త్వములు నీవని, వానికి సాక్షినైన నే
నరయఁగ జీవనామకుఁడనై యలరారు శివుండ నన్న సు
స్థిరమతి, తల్లిఁగొల్వ శివ యె చేకురదంచును, వేదసారమై
పరఁగెడి శ్రీమహామనువె పట్టుగ వద్దునఁదెల్పి రమ్మికా!

572

♦ అమ్మది మాది యంచుఁదనయుల్ గొనిపోయెద రింతొ యంతొ రొ
క్కః మ్మది యంతతో సెలవు గాని, కుమారుని వంతు వచ్చుని
త్యమ్మగు నమ్మ సేవనగు తన్విసుకమ్ములె చెల్ల; వందుచే
నమ్మ కుమారరత్న్య యగునంచును గట్టడ చేసి రమ్మరో!

573

♦ పువ్వులనవ్వుతో జగముః మో మరవిచ్చెడి వేఁగుబోటిపై
నవ్వుల కీవు రువ్విన ఘనంబగు మూఁదుపసిండి బంతి య
ట్లువ్వన మింటికెక్కు నొక యుత్తమవస్తువునందు నిల్పినీ
నవ్వుమొగంబు నెన్న, గగనమ్మో? యనామయసిద్ధి, శాంభవీ!

574

♦ నీరూపంబు మనస్సు, నీమనువును స్నీరూపు నిక్కంబు, తా
నీరూపే యని గొల్చు జన్మికిలలో నీరూపలా శక్తి లా
ధారంబై సుగమిచ్చు చంతమున నిత్యమ్మైన తావిచ్చు నం
చేరాశమ్ము మహర్షులన్న నుడులే, యీశాని మాప్రాసుదుల్.

575

♦ నిను సేవించి వశంవదుండగుచుఁ దన్నే నీకు సర్పింప మా
ని, నినున్ లోఁగొనఁజూచు స్వార్థపరుఁడౌ నీచుండు, సర్వేశ్వరీ!
తనుఁగష్టంపడి పెంచి సర్వమిడి వాత్సల్యంబుఁజిల్కించు తం
డ్రిని స్వాధీనుఁగఁజుల్కఁగాఁగనెడి యెడ్డంబోలి వ్యర్థుండగున్.

576

కులము నశింపఁజేయుమని కోరఁడెవండును, నేను గోరెదన్;
కులములతోడి లంకె విడఁగొట్టుము; నన్నకులమ్ముఁ జేర్చు; మీ
యలజడి మాయెడన్ గుపితవైనపుడే యగునమ్మ! దుఃఖస
మ్మిళితసుఖానుభూతి విరమింపఁగఁజేయు మమర్షమూర్తితో.

577

ఊడిచి నాయహంమమత, లోఁపిన యంతగఁజూచిరోఁగ, జి
డ్డూడదు మూలముట్ట; మిగులున్న రవంతయు నూడ్చి, విప్పవా
మూడవ గ్రంథి? నాదు బలముంజలమున్ సరిపోక కాదె, యీ
యేదుపు? చేయి చేసికొనవే నిఁక నాగతి యేమి? శాంభవీ!

578

కడమగు నాల్గు జన్మముల కర్మఫలాలు కుదించి యిప్పుడే
కుడిపి, మఱొక్క తల్లి చనుగ్రోలెడి గోడెడలింతు, నిన్ను నా
యొడి నిడుకొందు నుమ్మలిక మొందకు బిడ్డడ! యన్న నెయ్యపు
న్నుడి మఱువంగ రాదిఁక, జనుర్మృతిపీడ సహింపలేన్ సుమా!

579

అతిహితు నట్ల యుండి, కుశలాహతికే గుఱిచేసి నన్ను, స్వ
స్థత కెడఁబాపి, నీదరికిఁజేరెడి నాయదుగాడనీని యు
స్మిత, మమతాద్వితీయుఁడయి, చేసెడి భంగముఁజూచియున్ గృపా
చ్యుత వగుదే? నిశుంభయుతశుంభునిఁగూల్పవె వేగ చండికా!

580

ఇంచుక యాత్మసంయమన మెట్టులొ యబ్బినయంత నే, జగ
ద్వంచక బుద్ధిఁదుచ్ఛధనదంబగు గారడి విద్దె గాగఁ జె
ల్లించుచు, నాట సాగ నవలేశము పెంచి చరించు బిడ్డలన్
గాంచి, సుఖించెదో, కరము గాసిలెదో, కనఁజాల; నంబికా!

581

తన మేజిక్ పనులెల్ల సిద్ధులనుచున్, దాపించె రాజేశ్వరీ
ఘనకారుణ్యము చేతనంచు, భవదాఖ్యన్ దాలుగాఁ జేయు వం
చవసిద్ధున్ దొలఁగింప కాత్మసుముఖున్ గావింపవే తల్లి! యె
ట్లును నీపేరె కదా ముఖమ్మునఁబొకాలున్ మంచికో చెడ్డకో.

582

నీవపవర్గదాత్రివను నిక్కమెఱింగిన బిడ్డ, లమ్మయే
కావలెనంద్రు; తుచ్ఛధనకాంక్షలు తోతెము లమ్మసామ్ములే
కావలెనంద్రు; బిడ్డ నయగారము నీవనియైన, వారి మో
హావిలతన్ దొలంచుటయు నమ్మ పనే కద; చూడు మంబికా!

583

ఇతరము లేల? మాఱు నుడి యిమ్మొక దానికిఁదల్లి! నీవు సం
తతులనె నిన్నెఱుంగని విధమ్మునఁ జేసితి; నిన్నెఱుంగు మా
జతనమె తండ్రినిం దెలుపు సాధనమాటయె కాక, మీ యభి
న్నత నెఱిఁగింపదో? తెలిపి మాయురియాటల మాన్పుమంబికా!

584

అలసత లేకె కొల్చితిఁగులాంగనగా నొక కొన్ని నాళ్ళు; ల
వ్వల భజియించినాఁడఁగులపాలిని వాటను గొన్నినాళ్ళు; త
త్ఫల మనుభూతమయ్యె, నిఁక వాంఛిత మీకులనాశనమ్మె; నా
వలసినదంతె; నాకకులవైభవ మీయవె వేగఁజండికా!

585

♦ ధనముం గూర్ప, యశమ్ముఁ గైకొనఁగ నిత్యంబేను బడ్డట్టి యా
తనలో నిన్నును గ్లేశపెట్టితిని గాదా, నాఁటి చుట్టాలు కా
మన మున్నా బజవాబు కన్గొనఁగ నీకైపోయె నాబుద్ధి, చే
సిన నేరమ్ముల నొప్పుకొంటి, నిఁక నీ చిత్తమ్ము నా భాగ్యమా.

586

♦ కాకుల కొంటెబుద్ధి, పులి క్రౌర్యము, నల్లుల దొంగయెత్తు, జం
బూకపు జిత్తులు న్వెలయఁ బుట్టిన మానిసులెల్ల నీకృపా
లోకము లేక కాదె భువిలో నిటులాట, జగజ్జనిత్రి! స
ల్లోకము వారి బాధలకు లోనయి కుందుట నీకు ముచ్చటా?

587

♦ ధనము భవత్స్వరూపము కదా, మఱి దానికె సేవ చేసి పెం
పొనరుచు వారి నీదు కరుణోన్నతి కర్హులుగా నొనర్పకే
నిను మఱపించు వస్తువుగ, నీచమదాంధ్యముఁ గూర్చు దానిఁగాఁ
బొనరుతు వెందుకింత పనిపూనుట లీలయొ? వారి కర్మమో?

588

♦ ధనము గడించె నీయఁడని తండ్రిని చావునె కోరు బిడ్డ; పె
ట్టని కొడుకంచునుం జెడఁబడక శపియించును దండ్రి; ఆస్తివం
తనుచును బుట్టెపంపుగుల నన్నలుఁదమ్ములుఁ గుందుచుండ్రహా!
ధనతనువూని నీవు నరుఁదార్చెడి సౌఖ్యమిదా? హరిప్రియా!

589

♦ జనకుం బోలిన పుత్రు నీయ వశటా! దాంపత్యమందేడనో
యనుకూలత్వముఁ గూర్తు; రూపమున రమ్యత్వమ్ముతో సద్గుణ
మ్మొనయం జూడవు; నీదు సర్జనవిధం బీలాగుదా? వింత! నీ
కొనముల్ తిన్నన గామిరామా; కరుణ లేకో, పన్నుది ట్లంబికా!

590

అనఘతపస్వివంశజని నందియు నీమహిమామృతాబ్ధిలో
మునుఁగను, దత్కథానురసముం జవి చూడను, వాంఛలేని దు
ర్జనములు, మున్ను దేవపితృశాపవశమ్మున నీయెడన్మొగ
మ్మును చెడఁద్రిప్పినారలన మోసము దోసము లేదు; వాసవీ!

591

జ్ఞానవిశిష్టజన్తువుగఁజల్పితి మానిసిఁ; గొంతమంది క
జ్ఞానకృతజ్ఞతాఫలదసాధనమే నదికా కజాగళ
స్థానపయోధరద్వితయసన్నిభ మాటది పాపమో? నిన్
గానని లోపమో? బుధుల గాటపు శాపమొ? పాపనాశినీ!

592

ఎగ దిగఁజూచి యంకెలు గుణించెడి వారల పల్కులేల న
మ్మగ? గ్రహాతారకాళిని ఖమార్గమునందునఁద్రిప్పు నీవు; మ
న్పఁగలవు వెక్కులేఁడులు కృపన్నను; లోకసుఖప్రదక్రియల్
నెగడఁగఁజేయు యంత్రమిది నీది చిరస్థముఁజేయవా? శివా!

593

కొడుకుల్ సద్గతులిత్తురంచు నవివేకుల్ సువ్రతక్లేశముల్
పడి, యాసంతతి దుష్టమౌచు మనఁగాఁబాతిత్యమే పంటగాఁ
జెడరే యెందరొ? స్వర్గమోక్షదము నీశ్రీపాదమే యంచు నిఁ
విడకుంటే సుగతిప్రదంబు తనయాపేక్ష గనన్ శాంభవీ!

594

జననీ! నీకుఁబ్రసిద్ధమైనది కృతజ్ఞానామ, మాశ్లేషమా
గానమే భక్తిగ మాఱు, నీసుతులలో గోరంత లోపైనచో
జను లెన్నెత్తిన భక్తుఁడౌనె? పయివేసా లెన్నియే న్వేసినన్
జనపూజార్హుఁడు కాఁడు; పామరజనుల్చక్రార్తి యుందప్పునే?

595

♦ అన్నిట సామరస్యమును నందము నెన్నుచు, స్వార్థతాగ్రహా
భ్యున్నతినైచ్యముల్, కినుక, మోటుతనమ్మును లేని చోట, సం
పన్నదయారసంబొలుక భాగ్యముల న్గడియింతు; వట్లు కా
కన్నమె మైన, వేచి యడుగంటఁగఁజేయు టెఱుంగనా? రమా

596

♦ కులసతి నేడిపించినను, గోవుల మేపక తాను దిన్నఁ బా
పలఁ బ్రహరించిన న్మదిరపానము చేసినఁ జేసినట్టి మే
ల్దలఁపక యున్న, వంద్యపదుల న్గనిన న్గదలవంచకున్న, వా
రల సిరి లేవఁదీయుదు పరాతులు గాఁగని, కిన్కతో సుమా!

597

♦ ఆస, యసూయ, గబ్బు, దురహంకృతి, స్వార్థపరత్వముఖ్యముల్
మాసిన భక్తహృత్కమలమందిరమందె యథేచ్ఛ నీవసా
యాసముగాఁ జరింతువు; విహారవనమ్మున గాబు నిండిపోఁ
గా, సుకుమారు లందు దిగఁగాలిడ నేర్వరుగా; గుణాలయా!

598

పైకము నీదు రూప మది పార్థివభోగదమంచు గొప్పగాఁ
బ్రోక యొనర్పఁ బాడి విడి పూను దురాశుఁడు నీదు దివ్యమా
శ్రీకరరూపముంగన పరింపఁడు; చిత్రము! నాఁడె తుచ్ఛమా
పైకము పైకమట్లు పయిపై కెగురుం బ్రుటిలోనె; శ్రీరమా!

599

మనసున నొక్క టుంచుకొని మా కొకరీతిని వెల్లడించు దు
ర్మనుజుల చిత్తవృత్తివయి రంజిలు దంతియె గాని, సాదులౌ
తనయుల కెంత రట్టతి కతంబగునో, యది యెన్నకుంట, మా
మనసుఁ బరీక్ష చేయు నెపమా? యది స్వార్థమ? వృత్తిరూపిణీ!

600

తనుఁదనియింపనే ముదియు దాఁక శ్రమంపడు తల్లిదండ్రులన్
దనుపఁగ నింత యొల్లని కృతఘ్నుసుతుల్, గయిపెత్తినట్లు తె
వ్వనిఁదనియింపనే వివిధభావములం బఱవెత్తు దట్టి నిన్
దనుపఁగ లేని జీవునకుఁదాఱ్చ గతు ల్వినిపింపు మంబికా!

601

♦ కొడుకుంగోడలు మన్మలున్ హితులు నాకుంగూర్చు చుట్టాలుఁగ
ల్గెడలింవంగల వారు కారు; ఋణమెట్లో చెల్లు పెట్టించుకో
బడగారమ్మను జూపువారె; జగదంబా! వీరి యప్పింతతోఁ
గడముట్టింపనె నీదు పాదవికసత్కంజాతముల్పట్టితిన్.

602

♦ నా సంకల్పము, మాట, పూన్కి, పనియు, న్నానిశ్చయం బీవమై
భాసిల్లన్ బర బాధకమ్ము లగునా? భక్తాశ్రితీ! భక్తివి
శ్వాసమ్ముల్ కొఱవడ్డ నెమ్మదులకే వ్యత్యస్తమై తోఁచు, న
మ్మా! సైరించి వివేకదీప మిడుమా, యాచీఁకటిండ్లన్, శివా!

603

♦"దాసుని తప్పులన్నియును దండముతో సరి" కాదె; యిందు నా
వ్రాసిన తప్పులన్ సయిపు, వందనముల్; మఱి వైఖరీగతిన్
భాసిలి లోననుండి వెలువడ్డది నీవె కదా, మదంబ! యీ
దాసుని మాటకుంగినియుదా? కనెదా కృపతో సరస్వతీ!

604

♦ జననిరో! నీవె ముచ్చటల చాద్పున నన్నవి గాని, గొప్పకే
ననినవి కావు; కావున మహాస్థఁబరించెడి సాధకవ్రజ
మ్మునకు ముదావహమ్ములగుఁబో; మఱి వీని రహస్యముల్ గ్రహిం
చిన యతఁడీ స శర్మగతిఁజెందక యుండునె? శర్మదాయినీ!

# పద్యముల వరుసను కొన్నిమాటల కర్థములు.

1. తాలాంక=బలరాముఁడు, ఠిక్క=స్థానము.

8. విందులు = అతిథులు, చుట్టాలు.

ఒజ్జబంతి = వ్రాత నేర్పుటకై ఉపాధ్యాయుఁడు వ్రాసిపెట్టు మొదటిపంక్తి.

9. మన్నట్టి=జీవించినట్టి.

12. గురువులువాఱు=శోభించు, రవడి=అప్పు.

13. కావ్యాహరాంతార్చనము=శుక్రవార సాయంకాలపూజ.

17. కందువమ్ము=రహస్యము.

22. పుట్టునిక్కచ్చి=జన్మవ్యాధి, ముచ్చట=ప్రేమము.

25. అటమటబుద్ధి=మోసగించుబుద్ధి.

26. నిప్పచ్చరము=దారిద్ర్యము, ఒచ్చెము=నింద.

27. తేట=తెలివి, రెక్కొక్కఁ=బయల్పడక.

31. నిలువు=శరీరము, సూరులు=పండితులు.

32. తలము=శక్యము.

34. ఒడయండ్రు = ధనాఢ్యులు.

35. గేహేవీరుఁడు=ఇంట బీరములు పల్కువాఁడు.

ఆలపుఁదలఁ=యుద్ధవేళ.

37. తలవాకిటఁ=నోరఁ.

41. వాతెఱ=పెదవి.

42. ఆనినాడను=త్రాగినాడను.

43. రిమ్మ, పిచ్చి, పిచ్చు, తిక్క, ఉమ్మాదము = వెఱ్ఱి.

వెజ్జు = వైద్యుఁడు.

46. రెచ్చి = హెచ్చి, అచ్చునఁ = విధమున,
నచ్చు = దుఃఖము, ఒచ్చెము = నింద.

47. జానుగులు = చెవులు.

49. బోర = వక్షము.
అక్షస్రక్కు = పూసలపేరు. 'అ' మొదలు 'క్ష' వఱకు
గల మాతృకార్ణముల మాల.

50. పంచదశీ త్రికూటములు = (1) ఐం, క, ఏ, ఈ, ల, హ్రీం
(2) క్లీం, హ, స, క, హ, ల, హ్రీం
(3) సౌః, స, క, ల, హ్రీం—
చాల్పు = వరుసపేర్పు, జనులు = జన్మములు.

52. మహాసరోజము = సహస్రారము.

53. మెయి = శరీరము.

54. షడధ్వములు = వర్ణము, కళ, పదము, తత్త్వము,
మంత్రము, భువనము.

55. కసెపుఁజీరెలు = కాషాయవస్త్రములు.

56. పులుకుటీరము = గడ్డిగుడిసె.

57. సద్దు = ధ్వని.

58. నికము = సత్యము, వాలకము = విధము.

61. సామయి = సమయాచారతత్పరుఁడు.

64. ఆజ్ఞ = కనుబొమ్మలయును ముక్కు మీఁదికొనయును సంధిస్థలము
(ఆజ్ఞాచక్రము)

70. తేఁకువ = నిలుకడ, కన్కలి = చూపు.

71. గాలుల్ రెండు = ప్రాణాపాన వాయువులు.
లాగు = వెఱవు, విధము.

72. ఆయాతు=వచ్చుగాక, సందెవార్చు=సంధ్యావందనము.
73. ముద్దాక్షరముల్=సంతోషమునిచ్చు నక్షరములు.
75. ఎన=సాటి, పద్య=మార్గము.
76. ముడులు = బ్రహ్మ విష్ణు రుద్ర గ్రంథులు, చిక్కుబడిన దారములందలి ముడులు.
గాలినిగట్టుట = వాయువును నిరోధించుట.
దివ్యనేత్రము=మనోహరమైనవస్త్రము, అమానుషదృష్టి.
83. మొకమ్మున=ఎదుట.
85. సాహం = (బ్రహ్మస్వరూపిణియైన) ఆమెయే నేను.
ఆజ్ఞనునిల్చి=ఆనమీరక, ఆజ్ఞాచక్రమందు నిల్చి.
88. హార్షికతమస్సు=ఇంద్రియములవల్లనైన అజ్ఞానము.
కుహువులు=అమావాస్యలు.
91. లాతి = ఇతరుఁడు.
93. గదులు = రోగులు.
95. భవరుజన్న మాతృమంత్రము=సంసారరోగమును పోగొట్టు శ్రీ మాతృ మంత్రము.
96. అగదంకారుఁడు = చికిత్సకుఁడు.
101. శ్రేపు = దూడ
103. మనువు = మంత్రము.
104. ముడి = సందేహము
105. జని = జన్మము. విష్ణుపదము=ఆకాశము. సర్వవ్యాపక పరమాత్మపాదము.
మహాకవీంద్రుఁడు = మహాకవిశ్రేష్ఠుఁడు, కాళిదాసుఁడు.
చిద్గగనచంద్రిక = జ్ఞానాకాశమందలి వెన్నెల. చిద్గగన చంద్రిక మహాకవి కాళిదాసుని రచనములందు మిన్న.

106. నిర్వారము=మిగులు,

109. షట్సరోజములనాళము=సుషుమ్నామార్గము.

110. దాత్రము=చేసఁగోసికొను కొడవలి.

115. తదనూద్భవుఁడు = ఆమె తమ్ముఁడు.

116. సాయించువారు=చెప్పెడివారు.

117. మంత్రి=రాజుల కాలోచనము చెప్పెడివాఁడు, మంత్రము
జపించువాఁడు.

పురము = పట్టణము, దేహము.

జనములు = ప్రజలు, ఇంద్రియములు.

పెనుదారి = రాచబాట, మోక్షమార్గము.

గాయత్రి = తన్ను గానము సేయువారిని రక్షించునది,
గాయమును (ప్రాణమును) రక్షించునది
అనగా దీర్ఘాయురారోగ్యములను నిచ్చునది.

119. అమవసచూడ్కి=పూర్తిగా రెప్పలుమూసి చూచుట.

పున్నమచూపు=బాగుగా కనులువిప్పి చూచుట.

పాడ్యమికనుబాటు=అరమోడ్పుగనులతోఁ జూచుట.

121. పద్మవని = సుషుమ్నామార్గము.

కల్పవని = సహస్రారము.

శుక్లరక్తచరణములు = ప్రకాశచరణము, విమర్శచర
ణము (గురుముఖవేద్యము).

ఎరఁగుట = మ్రొక్కుట.

123. వలి = గాలి.

125. మందరి=వైద్యుఁడు. నలక=వ్యాధి.

126. ఎఱ్ఱజుట్టుపుంజు=కోడిపుంజు.

**130.** అపర్ణుఁడు=ఆకై నను దినని వాఁడు, అప్పుతీరినవాఁడు.

**133.** మన్కి=జీవనము, వ్రితపము=సిగ్గుమాలినది.

**134.** తోకములు = బిడ్డలు.

**141.** అలవడి=వశమయి. తెక్కలి=ప్రమాదము.

**142.** ఎడ = స్థానము.

**144.** అక్షరక్షణము = ఇంద్రియ పరిపాలనము.

అక్షర+క్షణము=నాశనరహిత పరమాత్మవస్తువు నందలి వేడుక.

**164.** ఇవము = మంచు.

**166.** ఉవ్వెత్తుగ = ఒక్కసారిగ.

**167.** మేతాల్పు = దేహధారణము.

**169.** గాములు = గ్రహములు.

**171.** వాగులు=ప్రవాహములు, పడుకులు=కొండలు, నీటితిట్ట=సముద్రము, లావర్లు=బలవంతులు.

**175.** గాసి = ఆయాసము.

**176.** అగ్గంబగు = లోఁబడు.

**178.** నవనాథాగ్ర్యశరీర = అమ్మ తన తత్త్వమును జగములఁ బ్రవచించుటకై నాథసంజ్ఞతోఁ దొమ్మండ్రను సృష్టించెను. శ్రీచక్రమందు అమ్మసమీపమందే వారికి స్థానము. వారు దేవీస్వరూపులే.

నవయజ్ఞము = కృషికుఁడు ఆశ్వీజ శుద్ధ పూర్ణిమకుఁ గ్రొత్తపంటను గౌరీదేవి కర్పించుట.

**183.** నీఱు=బూడిద, ముదల=ఆజ్ఞ.

**184.** చిప్ప = అల్పము, ఖండము.

**188.** మేసాము = దేహమందలి సగము.

195. విద్యారాజము = పంచదశాక్షరీ విద్య.

198. వృత్తులు = సమాసములు.

199. అనంతము = ఆకాశము.

201. తూరల్=తుంపురులు, కళుకులు=కిరణములు.

203. కాతరుఁడు = భయభీతుఁడు.

204. రసరూపము = ఆనందస్వరూపము.

205. నెలవెలుఁగు = చంద్రకాంతి.

210. ఎడ = దూరము.

211. ముమ్మళ్లు = బ్రహ్మ విష్ణు రుద్ర గ్రంథులు.
ఇవే ఆగామిసంచిత ప్రారబ్ధకర్మములు.

219. మానిసిపుర్రెపేరు = నరరుండమాల.

226. కన్మొఱఁగించు = మోసపుచ్చు.

228. అబ్బుర = మెడ.

233. ఒబ్బిడి = నాశము, వైనము = కారణము.

235. కొసరు = అతిశయించు.
చొక్కటము = మంజులము, అందము.

236. తడికాన్కలు = జలములతోడి యర్ఘ్యములు.
లలి = ప్రేమము.

242. నా వ్రాసిన శ్రీసూక్త రహస్యార్థ మను గ్రంథమునఁ జదువునది.

243. దక్షిణకాళి = ఆశ్రితులయెడఁ బ్రేమముఁజూపు కాళి.

247. ఓగిరము = ఆహారము.

258. మాతృకార్ణనిచయాకృతి=ఆదిక్షాంతములైన వర్ణముల సముదాయమనెడి యాకారము.

రాయిడి = ఒత్తిడి, అల్లరి.

265. నెమ్మియాట = నెమలి నృత్యము.

268. దరియు = సమీపించు.

270. కాకవి = కాకి.

271. ఉద్వాసము = చంపుట.

273. కనుకలులు = చూపులు.

ఎల్ల = హద్దు.

275. సౌధమ్మ = అమృతమయము.

జనుశ్చక్రిక = జన్మమనెడి తిరుగలి.

281. లగ్గు = మేలు.

289. కర్కసపెట్టు = బాధపెట్టు.

290. నిరాగసుఁడు = పాపరహితుఁడు.

కాసవిలాసుఁడు = ఆనందవిలాసము గలవాఁడు.

292. ఇలి = మెతుకు, అన్నకణము.

విపద్ఘనములు = ఆపదలనెడి మేఘములు.

296. ఉరువు = రూపము.

300. అగడు = తొట్రుపాటు.

309. తిగమైలను = (స్థూల సూక్ష్మ కారణముల నెడి) మూఁడు శరీరములందు.

311. ఆడరే = నిందింపరే.

315. దగ = దప్పి.

317. తెల్విచిచ్చు = జ్ఞానాగ్ని.

319. అరయు = పరీక్షించు.

వంతు = పంతము.

321. ఆమెత, కట్టడము = అన్నము, వస్త్రము.

పాపతమి = వాత్సల్యము.

322. బాములు = కష్టములు, జన్మములు; లోఁబాము = కుండలిని, సబాము=స్వభావము, మదిఁబాముసిరులు= మనసునుగ్రమ్మిన చీఁకటులు, ములుచ = మూర్ఖుఁడు, టప్పాలు = డాబులు అను నర్థమిచ్చు వ్యావహారిక గ్రామ్యము.

326. ఉదాసీనత్వము=ఎత్తైనచోటఁ గూర్చుండుట, జోక్యము లేకుండుట.

329. శిలోచ్చయపుత్రి = కొండకూఁతురు.

330. శవతతియాసనము = అమ్మ. పంచప్రేతమంచాధిశాయిని. బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వరులు నాలుగు మంచ పాదములు. సదాశివుఁడు పై ఫలకముగానున్న మంచము అమ్మ యాసనము. అనఁగా సృష్టి స్థితి లయ తిరోధానానుగ్రహము లనెడి శక్తులు వీరివి. అవి సర్వశక్తిమయియైన అమ్మవే కాఁగా వీరు ప్రేతలుగా భావింపఁబడిరి.

శ్మశానము = సుషుమ్నా మార్గము.

దెసల్ వసనము = దిక్కులే వస్త్రము. అనఁగా దిగంత వ్యాప్తమగు విశ్వవిరాట్ జగత్తు అమ్మ స్థూల ముగ నెన్నఁబడినపుడు ఆ దేహమునకు దిక్కులే వస్త్రములు.

ఉత్పథలోల = ఉన్మార్గగామిని. మూలాధారమునుండి సహస్రారమువరకు నైన మార్గమందు సంచ రించునది.

333. నీడము = పక్షిగూఁడు.

334 విడుపుబాట = మోక్షమార్గము.

త్రిపురాంతకుఁడు = పురములరూపున గూఢచరిత్రులైన ముగ్గురు దైత్యుల జంపినవాఁడు, భక్తుల స్థూల సూక్ష్మ కారణము లనెడి మూఁడు శరీరముల నశింప జేయువాఁడు.

దణి = మగఁడు.

త్రైపురమనువు = ఐం, క్లీం, సౌః అనెడి మూఁడువర్ణముల మంత్రము.

340. వామాచారులు = అందమైన యాచారము గలవారు, శ్రుతివిరుద్ధమైన యాచారముగలవారు.

మద్వయము = 'మమ' అనుమాట.

వామాత్రయాకారిణి = మూఁడు శక్తులు రూపముగాఁ గలది.

341. అంబరనీరసంచరములు=ఆకసమందుఁ దిరుగు పక్షులు, నీటదిరుగు చేఁపలు మున్నగునవి.

347. కనలు = కోపము. కన్కలి = చూపు.

349. పూటము = భారము.

356. రసమూర్తి = ఆనందమే విగ్రహముగాఁ గలది.

360. నమస్య = మ్రొక్కు.

367. వరివస్య = ఉపాసనము.

376. బురడాలు = అసత్యములు, మోసములు.

అంబేదలు = తిండికిలేని పేదలు.

శర్మరూప = ఆనందస్వరూప.

380. అగదరత్నము = ఔషధశ్రేష్ఠము.

384. చివ్వపనిముట్లు = యుద్ధసాధనములు.

392. దవుచూపు = దూరదృష్టి.

399. స్తనయిత్న్వంతరగుప్తచంచలలు = మేఘములలో నిమిడి యున్న మెఱపులు.

402. వైషయికక్ష్వేళనిగారకారణ = విషయసంబంధమైన విషమును మ్రింగుటవలని తీవ్రయాతన.

405. రసాయనము = ముసలితనమనెడి వ్యాధినివారించు బల వర్ధకౌషధము.

407. కసగుడ్డలు = కాషాయవస్త్రములు.

409. కుంభసంభవుఁడు = ప్రాణాయామ కుంభక (వాయువును నిరోధించు) క్రియయందుఁ జక్కఁగా నిల్వఁగలవాఁడు.

412. విశ్వాసి = నమ్మకముగలవాఁడు, శ్వాసము నిరోధించిన వాఁడు.

416. కట్టనాల్ విరియంజేయు = స్థూల సూక్ష్మ కారణములనెడి త్రిపురములను నశింపజేయు.

425. ఆలము = ఉపేక్ష.

438. జీర్వాఁటు = తొలఁగు, అపసరిల్లు.

443. కేరఁడే = పరిహసింపఁడే.

444. ముచ్చట = ప్రేమము.

447. శర్మజలరాశి = ఆనందసముద్రము.

452. నిడుసెకయూర్పులు = వేడినిట్టూర్పులు.

462. అగ్గించు = కొనియాడు.

474. ఆగూ = జ్ఞానము.

477. ఈపద్యమందలి విషయమునుగూర్చి నా వేపీసూక్త పర మార్థమందలి సోఽహం, సమాధి భాగమును జూచునది

478. వాసోరచనమ్ము = వస్త్రనిర్మాణము.

485. అక్షశరీర = ఆదిక్షాంతములైన మాతృకావర్ణముల మాల శరీరముగాఁ గలది.

488. అరవాయి = సంకోచము.

490. సర్జనము = సృష్టి.

493. ఎరియుచు = పరితపించుచు.

494. క్రించు = అల్పుఁడు.

495. తతిచేటు = కాలవ్యర్థత.

499. ఈఁదు = గాలి.

503. హృషీకోపధి = ఇంద్రియముల కపటము.

511. ఆదట = తృప్తి.

518. ముత్తికుగులు = మూఁడుచుట్లు. సీద్రము = పాము.

532. కున్నా = ఛిడ్డా.

534. బ్రహ్మమ్ము = తపస్సు.

542. టంకారము = ఆశ్చర్యము.

560. ఏమైఁ = ఏవిధమున.

562. అవటము = గొయ్యి, నేలకన్నము.

566. వెంట = విధము.

576. కులము = సముదాయము. ఇచట విషయ సమూహా మనెడి ఖండఖండజ్ఞానము.

అకులము = అఖండజ్ఞానము.

580. అవలేపము = గర్వము. డాలు = మదింపు.

583. ఉఱియాట = ఆందోళనము, చాంచల్యము.

584. కులనాశనము - చూడు (576)

598. పైకము = ధనము, చిలుక పిల్ల.

599. రట్టడి = ఉపద్రవము.

# తప్పొప్పుల పట్టిక.

| పద్య సంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 8 | నద్వది | నడ్వడి |
| 20 | త్రక్షర | త్ర్యక్షర |
| 35 | సంకటపెట్టి | సంకటపెట్ట |
| 49 | అక్షయపల | అక్షయఫల |
| 58 | భ్రమశ్చిత | భ్రమనిశ్చిత |
| 77 | సంగాదము | సంగానము |
| 98 | అంతయునిలుప | అంతయున్నిలుప |
| 129 | కాపుదింప | కాపురింప |
| 132 | మహాత్ముడంచు | మహాత్ముడటంచు |
| 168 | వేములను | లేములను |
| 182 | హేతతౌను | హేతుతౌను |
| 191 | కాందగదు | కాందగుదు |
| 231 | ఎన్నికోటులు | ఎన్నొకోటులు |
| 284 | హ్రాపిక | హ్రాపీక |
| 287 | నిన్నుంగని | నిన్నుంగను |
| | 285 వ పద్యమే పొరపాటున 287 గా పునర్ముద్రితమైనది. | |
| 304 | ఎఱుగు | ఎఱుంగు |
| 306 | దరితంబు | దురితంబు |
| 320 | శ్రయమ్ము | శ్రమమ్ము |
| 327 | శాకరి | శాంకరి |
| 341 | నిలు | నిను |
| 345 | నిధిచు | నిధించు |
| 357 | సుతాళికిక | సుతాళిక |
| 359 | జనదుఃఖ | జనుదుఃఖ |
| 365 | యీమూడి | ఈమూడి |
| 368 | దృశ్యము | దృశ్యమ్ము |
| 370 | మ్మనెల | మ్మన్నెల |
| 398 | అలంది | అలంతి |
| 411 | టతయౌన్ | టంతయౌన్ |
| 424 | విది | విడి |
| 430 | యుల్లే | యెల్లే |
| 433 | సుతులెంతో | సుతులెంతో |
| 476 | ప్రణీత | ప్రణిత |
| 477 | కొందఱకె | కొందఱకు |
| | ఱది | రది |
| 483 | పీడె | పీడ |
| 499 | ఈదు | ఈడు |
| 520 | క్షణంబదెల్ల | క్షణంబందెల్ల |
| 521 | శరమ్ము | శిరమ్ము |
| 526 | నిచ్చతో | నిచ్చతో |
| 527 | ఆధ్యాత్మక | ఆధ్యాత్మిక |
| 530 | సంజ | సంజ్ఞ |
| 532 | నిడునే | విడునే |
| 533 | దీరాయాస | దీర్ఘాయాస |
| 539 | లతనిని | లతనిన్ |
| 548 | నూలమ్ము | స్థూలమ్ము |
| 565 | ఫలమ్మకై | ఫలమ్మలై |
| 581 | దాలు | డాలు |
| 590 | చెడ | బెడ |
| 599 | రట్టతి | రట్టడి |
| 602 | నెమ్మములకె | నెమ్మదులకే |



# సాధన గ్రంథ మండలి, తెనాలి.

స్థాపితము : 1945

కర్మ, భక్తి, జ్ఞాన, వైరాగ్య, నీతి, చారిత్రక ప్రబోధములైన ఉత్తమ ఆధ్యాత్మిక గ్రంథములు వెలువరించు సంస్థ.

చందా : మహారాజపోషకులు (శాశ్వతము) రు 116/- లు.
రాజపోషకులు ,, రు 58/- లు.
సభ్యులు (ప్రతి సంవత్సరము) రు 10/- లు.

ఈ మూడుతరగతులవారి పేర్లు ప్రతిగ్రంథమున ప్రకటించి గ్రంథములు ఉచితముగా పంపబడును. పోస్టుఖర్చులు మేమే భరింతుము. మండలిలో చందాదారులుగాచేరి మా కృషిని ప్రోత్సహింప ప్రార్థన.

| | | |
|---|---|---|
| 1 | భగవత్ప్రాప్తి - ఉపాయములు | 0- 4-0 |
| 2 | నరసదాసు కీర్తనలు | 0-10-0 |
| 3 | హరినామమహిమశతకం | 0-4-0 |
| 4 | సప్తమహావ్రతములు | 0- 6-0 |
| 5 | ఈశ్వరసాక్షాత్కారము | 0- 3-0 |
| 6 | శ్రీ సీతారామశతకము | 0- 2-0 |
| 7 | గీతాప్రతిభ | 0-12-0 |
| 8 | భాగవతకథ 1, 2, 3, 4, 5 భా. భా 1కి | 2- 0-0 |
| | 6, 7 భా. భా 1కి | 2- 8-0 |
| 9 | శ్రీ త్రిపురాంతకేశ్వర శతకము | 0- 4-0 |
| 10 | శ్రీ త్యాగరాజచరిత్ర | 0- 4-0 |
| 11 | పరమసాధన | 0-12-0 |
| 12 | కాళహస్తీశ్వరశతకం | 0- 8-0 |
| 13 | ఆశ్వినమాహాత్మ్యము | 2- 0-0 |
| 14 | భారతీయతత్త్వశాస్త్రం | 2-0-0 |
| 15 | శ్రీరామపూజావిధానము | 0-4-0 |
| 16 | బదరీయాత్ర | 1- 0-0 |
| 17 | కల్యాణకంజము | 1- 4-0 |
| 18 | సిద్ధాంతకల్పవల్లి | 1- 0-0 |
| 19 | మానవధర్మము | 1- 0-0 |
| 20 | అష్టాదశశ్లోకగీత | 0-12-0 |
| 21 | భక్తితత్త్వము | 0-12-0 |
| 22 | ముక్తిగీత | 0- 6-0 |
| 23 | గురుశిష్యులు | 1- 0-0 |
| 24 | సంకీర్తన మీమాంస | 1- 0-0 |
| 25 | పరమార్థతత్త్వము | 0-12-0 |
| 26 | శ్రీ శుకుడు | 0-12-0 |

